దకుడు౧ నక్షత్రమయమైన సర్వాకాశమును సందలి జీవరాసులతోడను నివాసముల తోడను నొక వస్త్రముతో వలె నాచ్ఛాదనము చేసినాడు౨ మిత్రుడతని సంతత మిత్రుడు వరుణ మిత్రులు కలిసి వాడినప్పుడు రాత్రిందివములు అంధకారజ్యోతులు వరుణుని రూపము క్రమముగా మార్పునొంది దేవతలలో ధర్మమూర్తి యగును ప్రపంచము నవలోకించుచు దుష్టులను శిక్షించుచు దన్నాశ్రయించిన వారిని పాపములనుండి రక్షించు చుండును సూర్యుడాతని చక్షువు ఆకాశమాతనిదుకూలము మహామారుత మాతని యూపిరి౩ నదు లాతని యాజ్ఞచే ప్రవహించుచున్నవి౪ అతనివలని భయముచే సూర్య చంద్ర నక్షత్రములు తమ తమగతులు తప్పకుండ సంచరించుచున్నవి౫ ఆయన శాసనముచే భూమ్యాకాశములు విడిగా నిలుచుచున్నవి భౌతిక ధార్మిక వ్యవస్థ యాతని భుజములపై నిలిచియున్నది ఆతడు చపల చిత్తుడు కాడు ధృతవ్రతుడు ఇతర దేవతలాతని యాజ్ఞ ననుసరింతురు ఆతడు సర్వజ్ఞుడగుటచే పక్షుల గమనములు సాగరములో నౌకల మార్గములు వాయుసంచారము లాతడెఱుగును చీమ చిటుకన్న నాతనికి దెలియును ఆతడు దేవతలకు దేవత పరదేవతయునై దుష్టశిక్షణము శిష్ట రక్షణము జేయును తాను లోకమున స్థాపించిన శాశ్వత ధర్మశాసనము ననుసరించియే తానును నడుచుకొనును అయినను దన్ను దూషించినవారు వేడిన క్షమించి దయతో జూచును వరుణునకు జెప్పిన మంత్రము లన్నిటిలో దాము చేసిన పాపముల నుగడించ పశ్చాత్తప్తులై చేయు క్షమార్పణములే యున్నవి దీనివలన నార్యుల హృదయ ములు పాపభీతితోడను ప్రార్థనములతోడను నిండియున్నవని తోచును ౬

భాగవతులయొక్కయు వైష్ణవులయొక్కయు భక్తి ప్రధానమైన యేకేశ్వరవాదమునకు బీజములు పాపమువలని భీతి దేవుని క్షమాన్విత కృపయందు విశ్వసించి చేసిన వరుణో పాసనమందు గలవు మెగ్డొనల్ పండితు డిటు వ్రాసెను అత్యుదారమైన యేకేశ్వర మతము నందలి పరమేశ్వరుని లక్షణములు వరుణునికి గలవు౭

---

౧ ౩ ౩౧ ౧౭ ౨ ౮ ౪౧ ౩ ౭ ౮౭ ౨ ౪ ౯ ౨ ౮ ౨ ౨౮ ౪
౭ ౮ ౭ ౫

౫ అథర్వవేదము (౪ ౧౬ ౧ ౧) నుండి మ్యూర్ పండితుడు వరుణమంత్రములను పద్యరూపమున భాషాంతరీకరించినాడు దీనివలన వైదికార్యుల దృష్టిలో దేవ భావ మత్యున్నతమైనదని గోచరింపగలదు సర్వజీవరాసులను సృజించి దయతో వారినజ్ఞానము నుండియు బాపములనుండియు గాపాడునని దాని సారాంశమైయున్నది

౬ వేదిక్ మైథాలజీ పుట 3

౭ తత్త్వమూలసూత్రముల లక్షణము— సృష్టికి పూర్వము దేవుడని హెగెల్ పండితుడు చెప్పినాడు

వరుణుని యధీనములో నున్న శాసనమునకు ఋత మని పేరు ఋతమనగా వస్తుస్థితి శాసనము నందిమిడియున్న ధర్మము నిందుఁ గలవు సూర్య చంద్ర నక్షత్రముల యవక్రగతులను అహోరాత్రములయొక్కయు ఋతువులయొక్కయుఁ గ్రమములను జూచి మొదట యీ సూత్రమును గనుఁగొనిరని తోచును ప్రపంచ క్రమమే ఋతము ప్రపంచములో నేది క్రమబద్ధమో యందు ఋతమను నియమమున్నది ప్లేటో చెప్పిన విశ్వభావములకు నీ ఋతమునకుఁ బోలిక యున్నది దృశ్య ప్రపంచము నాశమగుచున్న దృశ్యములలో నవి నాశమై శాశ్వతమైన సత్యరూపముగల ఋతముయొక్క ప్రతిబింబమే వేదద్రష్టలు ఋతము నుండియే సర్వదృశ్యము లేర్పడినవని నమ్మెదరు కావున ఋతమే మనకుఁ దండ్రి యనిరి

ఋతముయొక్క నిలయమునుండి మరుత్తు లుద్భవించినారు ౧ విష్ణువు ఋతముయొక్క గర్భము ౨ భూమ్యాకాశములు ఋతమువలననే యట్లున్నవి ౩ మార్పులేని పరమ సత్యమును గూర్చిన రహస్య జ్ఞానబీజము లిచటనే యారంభించినవి ఏది స్థిరశాసనమో యది మారదు దృశ్యమైనది పరివర్తనశీలము గలిగి పరిపూర్ణమైన దాని ప్రతిబింబమే సత్యమైనది భాగములు మార్పులు లేనిది, అసత్యమైన దెప్పుడును మారుచు నదృశ్యమగును ఇట్టి సృష్టిశాసనము పరమేశ్వరుని సంకల్ప రూపమై నీతి ధర్మనిలయమై ప్రకాశించును దేవతలైన నీ శాసనము నతిక్రమింపఁ జాలరు ఈ భావ పరిణామములో భౌతిక లక్షణములనుండి దైవత్వమునకుఁ గ్రమాభివృద్ధిఁ గాంచనగును మొదట ఋతమున కర్థము జగమునకు సూర్య చంద్ర నక్షత్రములకు అహోరాత్రములకు సంధికాలములకు, నిశ్చితమైన గమన మార్గ మని చెప్పఁబడినది క్రమముగా నది మానవుఁ డాచరింపవలసిన ధర్మమార్గమై తరువాత దేవతలుకూడ ననుసరింపవలసిన పరమ ధర్మశాసనమైనది అరుణోదయము ఋతమార్గమునఁ జరించును, అదియే సరియగు మార్గమనియు, నిదివఱకే తనకుం దెలిసియున్నటును వర్తించును ఆమె యెన్నఁడును దారి తప్పదు సూర్యుఁడు ఋతమార్గమునే యనుసరించును ౪ జగమంతయు ఋతము మీఁద నిలిచి అందే నివసించుచున్నది ౫ ఋతమును గూర్చిన యీ భావమువలన విధిని గూర్చి వర్డ్స్‌వర్తు సంబోధించిన వాక్యములు స్మరణకు వచ్చుచున్నవి 'నక్షత్రము

---

౧ ౧ ౨౧ ౩   ౨ ౧ ౧౫౬ ౩   ౩ ౧౦ ౧౨౧

౪ ౦ ౨౪ ౮ హెరాక్లిటస్ చెప్పినాఁడు హెలియస్ అనగా సూర్య దేవుఁడు త్రోవ తప్పఁడు

౫ ౪ ౨౩ ౯

లవక్రమము౯ బోకుండ నీవే కాపాడుచున్నావు అతి సనాతనములైన ఆకాశములు నీ వలన శుద్ధములై ప్రబలములై యొప్పుచున్నవి ఎది భౌతిక ప్రపంచములో శాసన నియమమో నైతిక రంగమున నదియే ధర్మము నైతిక జీవితము గ్రీక్కుల భావములో సామరస్యము లేక వరిపూర్ణమైన క్రమము అభావమిచట సూచింపఁబడెను వరుణుఁడు మొదట భౌతిక జగత్క్రమమును నిలిపినవాఁడు తరువాత నైతికలోకక్రమమునకుఁ ప్రభువుగాఁ బరిణతి చెందెను ఋతస్య గోప్తా యటియుఁ బాపులను శిక్షించువాఁడు పెక్కువేళల వారుచేసిన దేవతా ప్రార్థనము లన్నియుఁ దమ్ము నవ్యమారములలోనుంచి కాపాడుమనియే ఓ మునీంద్రా! ధర్మమైన ఋతమారమున మమ్మునడపు దోష మగ్నులము గాకుండఁ గాపాడుము ౧

ఋతమును గూర్చిన భావమంగీకారము పొందినతోడనే దేవతల స్వరూపములలో మార్పులు వచ్చినవి కారణము లేకుండ బయల్వెడలు శక్తులయొక్క ప్యార్థక్రోధములకు గురియగుచున్నదని తలఁపబడినఁ ప్రపంచమును నక్రమోదేశముగల శక్తి నడపుచున్నదని తెలిసెను ఆత్మవిశ్వాసము సడలినపుడును వస్తువ్యామోహా మాకర్షించునపుడును నీ భావము మనకు చిత్తశాంతిని క్షేమమును జేకూర్చును ఎమి సంభవించినను ప్రకృతి సౌందర్యమున కనుగుణమైన నైతిక ప్రపంచమును నవ్యముగా నడపు నొక ధర్మమున్నది సుమా యను ధైర్యము మనకు లభించును రాత్రి గడచనఁ దప్పక సూర్యుఁ డుదయించునటే ధర్మము తప్పక జయము పొందును ఋతమును నమ్మవచ్చును

మిత్రుఁడు వరుణుని సహవాసి ఇరువుర నేకముగాఁ బ్రార్థించు వాడుక కలదు కొన్నివేళల మిత్రుఁడన సూర్యుఁడు కొన్నివేళలఁ గాంతి మిత్రుఁడు కూడ సర్వసాక్షియు నత ప్రియుఁడును మిత్రావరుణులు కలిసి ఋతమును గాపాడుదురు పాపమును పరి హరింతురు క్రమముగా మిత్రుఁడరుణ కాంతిగను వరుణుఁడు రాత్రియందలి యాకాశము గను తలఁపఁబడిరి మిత్రావరుణులు అదితి కుమారులై ఆదిత్యులనియు అర్యమ భగులవంటి వారిరియుఁ బిలువఁబడిరి

సూర్యుని గూర్చి ఎది మంత్రము లున్నవి మానవ మానసమునకు సూర్యో పాసనము సహజము గ్రీక్కు మతములోనిది యొక ముఖ్య భాగము ప్లేటో తన రిపబ్లిక్ గ్రంథములో సూర్యారాధనము గొనియాడినాఁడు అతనికి సత్పదార్థ చిహ్నమే సూర్యుఁడు పర్షియాలో సూర్యోపాసనము కలదు సమస్త కాంతికిని ప్రాణమునకుఁ

౧ ౧౦ ౧౩౩ ౬ ౨ రామానుజ భాష్యము ౨ ౬౦

గర్తయగు సూర్యునకు మహత్తర శక్తులున్నవి. చరాచరము లన్నిటి కాత్మ యాతఁడే. సూర్యుఁడు సర్వద్రష్ట; ప్రపంచ రహస్యములఁ గనిపెట్టు గూఢచారి. చీకటిని దొలఁగించి కాంతి నిచ్చి, తమ తమ కర్మలందుఁ బరతంత్రులగుటకై ప్రాణుల నాతఁడు మేల్కొల్పును. "మనుష్యులను జూచుచు, జరాచరములను గాపాడుచుఁ, బాప పుణ్యములకు సాక్షియై, ఉభయ లోకముల సంచరించుటకు సూర్యుఁ డుదయించు చున్నాఁడు ౧" ఈ విధముగా సూర్యుఁడు సృష్టికర్త, భర్తయును.

పదునొకండు మంత్రములచే స్తుతింపఁబడిన సవితృుడు కూడ సూర్యవర్గములోని దేవతయే. ఈతఁడు కాంచన నేత్రహస్త జిహ్వాలు గలవాఁడు. ఇతనికి సూర్యునికిని భేదము లేకున్నను గొన్నిచోట్ల భేదము చూపఁబడెను ౨. పగలు వెలుఁగుచున్న సూర్యుఁడే కాకుండ, రాత్రి కాలమందుఁ గనపడని సూర్యుఁడు గూడ నీ సవితృుడని చెప్పిరి. పాపోప శాంతికిఁ బ్రార్థనలు చేయఁబడిన యీతఁ డున్నత ధర్మమూర్తి. "అవివేకముచేఁ గాని, దౌర్బల్యముచే గాని, గర్వముచేఁ గాని, మానవ ప్రకృతిచేఁ గాని దివ్యాతిథిరూపుడఁవైన నీ యెడ మే మొనర్చిన పాపమును క్షమించి మమ్ము రక్షింపుము." గాయత్రీ మంత్రము పవితృరూపియైన సూర్యునికి సంబోధింపఁబడినది. "మా బుద్ధుల నాతఁడు ప్రకాశింపఁ జేయుఁగాక." సవితృుని సంబోధించిన, "ఓ సవితృదేవా! సర్వసృష్టికర్తా! మా యాటంకములను దొలఁగించి, ఆశీర్వచనములు ప్రసాదింపుము." మంత్రము యజుర్వేదము నుండి తఱుచుగా నుదాహరింపఁబడుచున్నది.

విష్ణురూపమున సూర్యుఁడు జగము లన్నిటి కాధారము.౩ విష్ణువు త్రిపాద దేవుఁడు. భూమిని, ఆకాశమును, మానవులకు గోచరించు నున్నతలోకముల నాతఁ డావరించి యున్నాఁడు. అతని మహత్త్వము నెవ్వరెఱుఁగఁ జాలరు. "భూమిపై నున్న మేము నీ రెండు స్థానముల నెఱుఁగుదుము, నీ నిలయమైన మూఁడవదానిని నీవు తప్ప నెవరెఱుఁగుదురు.?౪" ఋగ్వేదములో విష్ణువునకుఁ దక్కువ పదవి యొసఁగఁబడెను. కాని యితనికి ముందు గొప్ప పదవి లభించును. కాని వైష్ణవ మతమునకు బీజములు ఋగ్వేదమునఁ గలవు. ఆతఁడు బృహచ్ఛరీరుఁడనియు, ననగా లోకమే శరీరముగా గలవాఁడనియు, "ప్రాత్యేత్యావహమ్మ" నియు ననఁగా భక్తుల పిలుపు విని దర్శనమిచ్చు

౧. రామానుజ వేదాంతసూత్ర ౪౫.౪.౩

౨. రామానుజభాష్యము ౭.౬.౩

౩. ౧. ౨౧. ౫౪.

౪. ౧. ౨౨. ౧౮; ౭. ౫౯.

వాఁడనియు వర్ణింపఁబడెను మానవుని దుఃఖముఁ దొలఁగించుటకై మూఁడుసారు లాతఁడు భూమండల విహారము చేసె టల!

పూషన్ యింకొక సూర్యగణములోని దేవత పశుపాలకుఁడు క్షేత్రపాలకుఁడునైన దేవత యగుటచే మానవ బంధు రీతఁడు ఇతఁడు వ్యవసాయము చేయువారికిఁ బాంధులకు దేవుఁడు

రస్కిన్ పండితుఁడు వ్రాసినాఁడు ఎవ్యమైన సమాలోచనము గల వానికిఁ ప్రభాతముకంటె నిగూఢమైన పావనత్వము వచ్చునది లేద అనంతమగు ని ప్రభాతము నుండి ప్రతిదినము ప్రాణకాంతులు ప్రసరించును ఇదియే ఉషాదేవి గ్రీక్కుల ఈవోన్ సూర్యుఁడు ³ శ్వినీదేవతలు ప్రేమించు సుందర వధువు తన హేమ కిర ములతోఁ దన్నాలింగన మొనర్చుకొనుటకై సూర్యుఁడు వచ్చు లోపునే యదృశ్యమైపోవును

ఏఁబది మంత్రములలోఁ బూర్తిగాను ననేకములైన యితర మంత్రములలో న సంపూర్ణముగాను స్తుతింపఁబడిన వా రశ్వినీ దేవతలు వీ రిరువురు కవలల వంటివారు కాంతి తేజములకుఁ బాలకులు దృఢగాత్రులు గరుడవేగ గమనులు వా రాకాశ దేవత బిడలు ఉషన్సు వారి చెల్లెలు ప్రదోషకాంతి వారికి మూలభూతము అందుకే రెండు ప్రదోషములకు నరువు రున్నారు క్రమముగా వారే మానవులకు దేవతలకు వైద్యులుగాను నద్భుతకరులుగాను దాంపత్య ప్రేమజీవిత రక్షకులు గాను ఖిన్నులైన వారి నన్ని దుర్దశలనుండియుఁ గాపాడువారుగాను వర్ణింపఁబడిరి

అదితినుండి యాదిత్యదేవత లుదయించిరని యిదివరకే చెప్పితిమి అదితి' శబ్దమున కర్థము హద్దులేనిది అగోచరము ననంతమునై అన్ని వైపుల నిండి భూమి మేఘాకాశముల యవతల కూడ వ్యాపించునదని దీని భావము ఇచట సూర్వలోకములలో నున్న సర్వమున కిది మూలశక్తి అదితి ఆకాశము మధ్యభావము అదితియే తలి తండ్రి కుమారుఁడు అదితియే పంచవరాత్మకమైన సర్వదేవతా రూపము అతిదియే పుట్టిన పుట్టబోవు సర్వవస్తు రూపము సర్వసృష్టిజాలమును సృజించి యాక్రమించిన సాంఖ్యములోని ప్రకృతి భావమిచట సూచింపఁబడినది అనాగ్నిమాండరు చెప్పిన అనంత తత్త్వ మిదియే

---

౧ ౧ ౧౫౫ ౬ ౨ మానవ బాధితాయ ౪ ౬ ౩ అశ్వినులు = గుఱ్ఱముల వరుసవారు ౪ రామానుజభాష్యము ౧ ౮౯

దేవతగా నారాధింపబడిన భూతములలో నగ్ని యొకటి అగ్ని ౧ ఒక యింద్రుని కి మాత్రమే తక్కువ పదవి గలిగి ౨౦౦ మంత్రములలో సంబోధింపబడినది సూర్యుని కార్చిచ్చునుండి అగ్నిభావ ముదయించినది మేఘములనుండి పుట్టు విద్యుత్తు అగ్నియే ౨ ఖాతినుండి కఱ్ఱనుండియుఁ గూడ నది వచ్చినది ౩ మాతరిశ్వ డగ్ని నాకసమునుండి తెచ్చి భృగువుల యధీనములో గోధుమ వర్ణముగల గడము నిశితములైన దౌడలు మండుచున్న దంతములు గలిగిన స్వరూప మగ్నికిఁ గలదని వర్ణించిరి నెయ్యి దారువు నాతని భుక్తి, సూర్యునివలెఁ గాంతిచే రాత్రి చీకటి నాతఁడు పోఁగొట్టును పర్వతముల నాక్రమించు నప్పు డాతని మార్గము ధూమమయము అతని కంఠనాదము మేఘనాదము పతాకమగుటచే నాతఁడు ధూమకేతువు ఓ అగ్నీ! మేము సమర్పించు నీ సమిధ నంగీకరించి మండి నీ ధూమము నాకసము వైపున కంపి ఊర్ధ్వలోక శిఖరముల నంటి సూర్యకిరణములలోఁ గలియుము ౪ ఈ విధముగా నగ్ని పచన గృహములందును హోమగుండములందే కాక యాకసమునందును వాయువునందును సూర్యునందును మేఘమునందును, మెఱపునందును సముద్రమునందుఁ గూడఁగలదు భూమ్యాకాశములందు వ్యాపించిన గొప్ప దేవతగా నగ్ని మారును ఈ భావము పెంపొందిన కొలఁది అగ్ని రూపము మహత్తరమైనది దేవ మానవులకు మధ్యవర్తియై అగ్ని సర్వసహాయకుఁ డగును ఓ అగ్నీ! మా యజ్ఞమునకు వరుణునిగూడఁ దీసికొని రమ్ము ఆకసము నుండి మరుదేవతలను దెమ్ము ౫ అగ్ని నా జనకుఁ డని నమ్మెదను ఆతఁడే నా బంధువు సోదరుఁడు మిత్రుఁడు ౬

అమర్త్యత్వమును మహోత్సాహము నిచ్చు దేవుఁడు సోముఁడు ఈతఁడవెస్తా లోని హయోమాకును ద్రాక్షాసవసురాసవముల కధిపతియైన గ్రీకుల డయోనిసోస్‌కును సరిపోవును మత్తు వలయువారికి సరిపోవు మత్తశాఖలివి దుఃఖితుఁడైన వానికిఁ దనదుఃఖములను మఱచుట కేదియో యొకటుండవలెను మత్తు కలిగించుపానము మొదట నారంభించు వాని కొకవిధమైన యాహ్లాదముతోడి గగుర్పాటు కలుగును వాఁ డున్మాదియనుటకు సంశయములేదు కాని వాఁడుమాత్రము తానొక దేవతా సంబంధమైన పిచ్చిలోనున్నట్లు తలఁచును దివ్యదృష్టి హఠాత్ జ్ఞానము నిగూఢ తత్త్వానుభవము విశ్వవిశాల దాన పరత్వము, సార్వజనీన సుహృద్గుణము వివి సమాధిగతమైన ఆత్మలక్షణములు

---

౧ లాటినులో ఇగ్నిస్ ౨ ౨ ౧౨ ౩ ౩ అరణులు

౪ రామానుజభాష్యము ౨ ౬ ౫ రామానుజభాష్యము ౧౦ ౮౦ ౧౧

౬ రామానుజభాష్యము ౧౦ ౭ ౩

అందుచే జీవికి మహోత్సాహజనక మగు సురయు దైవలక్షణసంపన్న మని తలంచుటలో నాశ్చర్యము లేదు. విట్నీ యిట్లు వ్రాసినాఁడు. అమాయకులగు నార్యులు ప్రకృతియందలి యద్భుతదృశ్యములను శక్తులను బూజించినారు. సురాపానము దేహమనశ్శక్తుల నుద్రేకింపఁజేసి యొకవిధమైన యున్మాదావస్థకుఁ గొనిపోయినపుడు మానవుఁడు సహజస్థితిలో నున్నప్పటికంటె నధికము నున్నతము నగు కార్యమొనర్ప సమర్థుఁడగుచున్నాఁడను సంగతిని వారు కనిపెట్టినంతనే, సురయందు దైవత్వము నారోపించి దాని నాస్వాదించిన వారికిటి దైవలక్షణములు వచ్చునని నిశ్చయించిరి. ఈ సోమమునిచ్చు లతను వారు లతలకెల్ల రాణి యనిరి. లతనుండి సోమమును దీయు విధానమును పవిత్ర యజ్ఞమనిరి. ఈ యజ్ఞమునందుపయోగించు వస్తువులన్నియుఁ బవిత్రములే. ఈ విధానముయొక్క ప్రాచీనతకు సాక్ష్యములు పారశీకుల అవెస్టా గ్రంథమునఁ గలవు. కాని యిట్టి సోమయజ్ఞము భరతవర్షమున నూతన వికాసము గాంచినది ౧. సోమరసము పూర్తిగా మూర్తిమంతము చేయఁబడలేదు. లతయు నందలి రసమును దృష్టియెదుట స్పష్టముగాఁ గాన్పించుచుండుటచే వానిని దేవత లనుటకు వారు సాహసింపలేకపోయిరి. సోమమును గూర్చిన మంత్రములను లతనుండి సోమమును పిండునపుడు పఠించుట కుద్దేశించిరి. ఓ సోమమా! ఇంద్రునికొఱకై నిన్నర్పించుచున్నాము మధురమై యుత్తేజకమైన ప్రవాహరూపమునఁ బ్రసరింపుము. ౮-౪౮-౩ వ మంత్రములో భక్తుఁడిటు తన యున్మాదమును వెలిబుచ్చును. మేము సోమమును ద్రాగితిమి మృత్యువును జయించి జ్యోతియందుఁ బ్రవేశించి దేవతలను జూచితిమి! దేహము వశము దప్పిన యీ స్థితి నాత్మసిద్ధియని తలంచుట వేదకాలమునకుఁ జెందినదే కాదు. త్రాగి పరవశమైనప్పటి దృష్టికిని యోగిదృష్టికిఁ గొంత సంబంధమున్నదని విల్లియమ్ జేమ్సు చెప్పుచున్నాఁడు. శరీరపరవశత్వమువలన దైవసాక్షాత్కారమగునని నమ్మఁబడెను. క్రమముగా సోమరసమును ఔషధశక్తులు కలిగినవి. అంధులకుఁ జూపును కుంటివారికి నడకను నిచ్చునది ౨. ఈ క్రింద నుదాహరింపఁబడిన గీతము వేదకాలమునాఁటి యార్యులు సోమమున కెట్టి ప్రాధాన్యమిచ్చిరో చూపుచున్నది.

ఓ సోమమా! సృష్టిలో నెచట శాశ్వతకాంతి యుండునో యెచట సూర్యుఁడుంచఁబడెనో యెన్నటి స్థిరమైన చావులేనిచోట నుంచుము.

౧ జర్నల్ ఆఫ్ అమెరికన్ ఓరియంటల్ సొసైటీ ౩ ౨౯౨
౯౧

ఎచట వైవస్వతపుత్రుఁడు ప్రభువై రాజ్యమేలునో ఎచట రికాన్ద్యుద్వార మున్నదో యెచట నఖండ జలప్రవాహములున్నవో యచట నాకు మరణరహితమైన స్థానము నిమ్ము

ఎచట స్వేచ్ఛగలదో స్వరములలో మూడవలోక మెచట నున్నదో యెచట లోకములు తేజోమయములో నచట నన్నమరునిగాఁజేయుము ౧

ఎచట నాశలు కోరికలుండునో యెచట తేజోమయుఁడైన సోముఁడున్నాఁడో, యెచట మృష్టాన్నము నానందముగలవో అచట నన్నమర్త్యు నొనర్పుము

ఎచట సుఖానందములుగలవో మోదప్రమోదము లెచటనుండునో ఎచట కామ్యాచలన్నియు సిద్ధిపొందునో యచట నన్నమర్త్యు నొనర్పుము ౨

పై నుదాహరించిన సోమమంత్రములో వైవస్వతపుత్రుని స్మరించితిమి అతఁడే ఋగ్వేదమందుఁ జెప్పఁబడిన యముఁడు అవెస్టాలోని వివస్వంతుని పుత్రుఁడైన యిముడు యిముఁడు యమమంత్రములున్నవి యముఁడు చచ్చినవారిలో శ్రేష్ఠుఁడు మరణించువారికిఁ బ్రభువేకాని దేవతకాఁడు యముఁడు మనుజులలో మొదట మరణించి పిత్రుయానమున నింకొక లోకమునకుఁ బోయినవాఁడు ౩ తరువాత వచ్చినవారందఱకు స్వాగత మిచ్చు దాతయైనాఁడు ఆ లోకములో నందఱకంటె నధికానుభవమున్నది కనుక నాతఁడు అందరకుఁ బ్రభువు కొన్ని చోటుల నాతని నస్తమించు సూర్యుని దేవత యని చెప్పిరి బ్రాహ్మణములందు యముఁడు మనుజుల దుష్కర్మములకు నిందించి శిక్షించువాఁడయ్యెను ని ఋగ్వేదమునందు దాతఁడు పాలకుఁడు మాత్రమే లూషర్ హెరాకిటసుచేఁ బలికించిన యీ మాటలలోని సత్యమును యముని వర్ణనము నిరూపించును మనుష్యులెవరు? మరణించు దేవతలు దేవతలెవరు? చావులేని మనుష్యులు

పర్జన్యుఁడార్యుల యాకాశదేవత ఇతఁడార్యులు భరతభూమిలోఁ బ్రవేశించిన తరువాత నింద్రుఁడయ్యెను ఎలన నింద్రుఁ డార్యకుటుంబమునకుఁ జెందని యితర జాతులలోలేఁడు వేదములలో పర్జన్యుఁ డాకాశమే భూమి మాత నే నామె పుత్రుఁడను పర్జన్యుఁడు తండ్రి మాకాతఁడు సాయపడుఁగాక ౫ అధర్వవేదమందు భూమి పర్జన్యుని

౧ జర్నల్ ఆఫ్ అమెరికన్ ఓరియంటల్ సొసైటీ ౭ ౬౮ ౨ ౧౦ ౨౫ ౧౧

౨ సేక్రెడ్ బుక్సు ఆఫ్ ది ఈస్టు వేదమంత్రములు భా ౧ చూడు బకే ఆఫ్ రిపెడిస్ గిల్బర్టుముర్రే భాషాంతరీకరణము పు 20

౩ పిత్రుయానము ౧౦ ౨ ౭ ౪ ౧౦ ౧౪ ౫ అధర్వవేదము ౧౨ ౧ ౧౨

భార్యయని చెప్పఁబడినది ౧ మేఘ వర్షాధిపతి ఎరసుఁడు ౨ దేవునివలె లోకమునంతిను రక్షించును సర్వప్రాణు లాతనియందు విశ్రమించును ౩ మేఘమనికాని వర్షమనికాని యర్థమువచ్చునట్లు పరన్యశబము కొన్నిచోటుల వాడఁబడినది ౪ విధ్యానియమం దేవుఁడై అశనిపాతమున కధిపతియైన పెర్కమన్కుకుఁ బరన్యుఁడు సరిపోల్పనగునని వ్యాఖ్యానములరు వ్రాసినాఁడు ౫

భయభీబత్సములను గలిగించు ప్రకృతి దృశ్యములలో శిలావర్షముతోఁ గూడిన తుపానునకు సరిపోవునదేదియును లేదు ఇంద్రుఁడు చెప్పుచున్నాఁడు నేను మెఱుముల నుఱుములను బంపినప్పుడు మీరు నన్ను నమ్ముదురు వానికి సంబోధించిన మంత్రముల సంఖ్యననుసరించి, వేదములలో నింద్రుఁడే విశేషస్తుతి నందిన దేవత ఇప్పటివలెనే ఆర్యులు భారతదేశమునకు వచ్చునప్పటికి వారి యైశ్వర్యమంతము నెప్పుడు వచ్చునో చెప్పఁజాలని వర్షముపై నాధారపడియుండెను కావున వర్షాధిపతియే సహజముగా ఇండో ఆర్యులకు జాతీయదైవతమయ్యెను నీలాకాశము నందలి ప్రదర్శనముల కన్నిటికి నింద్రుఁడే దేవత ఆతని ప్రకృతినుండి కలిగిన జన్మము స్పష్టము ఉదకమేఘములనుండి యాతఁడు పుట్టెను పిడుగే ఆయుధముగా ధరించి ఆతఁడంధకారమును బోనడచును కాంతి చైతన్యముల తేజోబలముల నాతఁడిచ్చును ఆకాశమాతని యెదుట మోకరించును భూమి గజగజలాడును క్రమముగా నింద్రునికి ఝుంఝూనీలాకాశములతోడి సంబంధము మఱుఁగునఁబడెను ఆతఁడు దేవుఁడై సర్వలోక జీవాధిపతియై సర్వమును జూచుచు వినుచు మనుజులకు సమున్నత భావాశయములను గలిగించును ౬ ఆతని వర్షములచే ననావృష్ట నంధకారమును దొలఁగించు నింద్రుఁడు అనార్యులతో నార్యులకుఁ గలిగిన యుద్ధములలో విజయప్రదాతయగు దైవమయ్యెను అవి క్రియా సాహసము లవసరములైన దివములగుటచేఁ బ్రజలు జయాక్రమణ వ్యాపారమగ్నులైరి మతాంతరులైన యితరజాతులతో నింద్రున కేమియుఁ బగలేదు వీరదేవతయై దేవతలు పుట్టినది మొదలు రక్షించి ఉభయలోకములను భయముచేఁ గంపింపఁజేసిన యాతఁడే దేవేంద్రుఁడు భూమిని బర్వతములను సృజించి అంతరాళము నాక్రమించి ఆకాశమును నిలఁబెట్టిన యాతఁడే యింద్రుఁడు సర్పమును జంపి సప్తప్రవాహములను గాపాడి గోగణమును రక్షించి యుద్ధమందు శత్రువుల

౧ ౧-౨ ౧ ౪-౨ ౨ రామానుజవేదాంత భాష్యము ౫ ౮౩

౩ రా భాష్యము ౮ ౧౦౧ ౬ ౪ రా భాష్యము ౧ ౧౬౪ ౫ ౯ ౬౧

౫ ఇండియా వాట్ కెన్ ఇట్ టీచ్ అజ్ ౬-౮ ఉపన్యాసములు

౬ ౮ ౩౯ ౩ ౮ ౯౮ ౫ ౨ ౧-౨

ుఋమాడు నాతఁడే యింద్రుఁడు భయానకమూర్తియైన యాతనిని సంశయించి యెచట
నున్నాఁడని ప్రశ్నించి శత్రువుం సొమ్ములను తుడిచివేయువాఁడాతఁడు కాఁడని వెక్కి
ంతురు ఆతనిని విశ్వసింపుఁడు ఆతఁడే యింద్రుఁడు ఆతని బలముచే నశ్వగోగణములు
సన్యములు నిలిచియున్నవి యుద్ధములో నుభయపక్షములవారు సాహాయ్యమునకై యాతనిఁ
ిలుతురు ఆతని సాయములేనిదే ప్రజలెన్నఁటికి జయింపఁజాలరు ఆతని వజ్రాయుధము
కూరులను నిమునములో వారించును ఆతఁడే యింద్రుఁడు ౧ ఇట్టి వీరరసావతార
మూర్తియైన యింద్రుఁ డుత్తమ దైవగుణసంపద గలిగి భూమ్యాకాశజల పర్వతములను
ాసించును ౨ వేదములలో నుత్తమస్థానమందిన వరుణు నీతఁ డతిక్రమించును ఆర్యులకు
ంభవించిన రణములందు శత్రువర్గముతోఁ బోరాడి శౌర్యప్రతాపములఁ జూపుటకు
ంతచిత్తుఁడు ధర్మపరుఁడు నుదారుఁడు నైన వరుణుఁడు ునికిరాఁడు ఈ ఘనపరివర్తన
ఎతిధ్వను ు కొన్ని ఋగ్వేదమంత్రములలోఁ బొడసూపును ౩

భారతభూమిలో ివసించుచున్న యితర జాతుల దేవతలతో నింద్రుఁడు యుద్ధము
ేయవల వచ్చెను జలోపాసకులు నశ్వత్థవృక్షార్చకులు గలరు ౪ ఇంద్రుఁడు పోరాడిన
ుతరజాతుల యారాధ్యులైన రాక్షసులు పెక్కురు గలరు వారిలో సర్వమైన వృత్రుఁ
కఁడు ౫ ఋగ్వేదకాలములో గల కృష్ణుల జాతిచే వీరుఁడుగా బూజింపఁబడిన కృష్ణునితోఁ
ాడ నింద్రుఁడు పోరాడవలసవచ్చెను ఆ శ్లోక మిటున్నది అంశుమతీ (యమున)
దీతీరమునఁ బదివేల సైన్యములతోఁ గృష్ణుఁడు ఎడిసియున్నాఁడు గొప్పగరనములు
యుచున్న యీ కృష్ణుని సంగతి నింద్రుఁడు దివ్యదృష్టిచేఁ దెలిసికొనినాఁడు ఈ దోపిడి
ంద్రమూక నింద్రుఁడు మనకొఱకు నాశమొనర్చెను ౬ సాయణాచార్య వ్యాఖ్యానము
లను నీ భావము స్ఫురించుచున్నది కృష్ణమతశాఖను మనము తెలిసికొను సందర్భములో
భావము మనకర్థవంతము కాఁగలదు రెండు లోకములు నా విజ్ఞానవిలసితుఁడనైన నేను
ర్వజీవుల సృజించితిని భూ స్వరములు నా వలన నిలుచుచున్నవి ప్రవాహములు

---

౧ రా వే ఋ భా ౨ ౧౨

౨ ౧౦ ౮౯ ౧౦

౩ వరుణుఁడు చెప్పుచున్నాఁడు నేను ప్రభువును ప్రభుత్వము నాది సర్వప్రాణి
తనైన నాకే దేవతలంద రధీనులై నా శాసనముల ననుసరింతురు మనుష్యుల పరమపావన
ములన్నియు నేఁబాలింతును ఓ యింద్రా! నేను వరుణుఁడను ఘనగంభీరముతైవ

౪ ౧౦ ౯ ౧ ౩ ౫ రా వే భా ౧ ౧౩౫ ౮

౬ రా వే భా ౬ ౩౩ ౨ ౬ ౨౯ ౨

వజ్రధరుడనై పలుగునట్లు నేను చేసితిని స్వర్లోకములను నేను స్థాపించితిని పవిత్రుఁడైన యాదిత్యుని సృజించినది నేనే భూమ్యాకాశాంతరాళములఁ గల్పించినది నేనే

ఇంద్రుఁడు చెప్పుచున్నాఁడు యుద్ధములో నన్నెరమైనప్పు డాశ్వికులు నన్నుఁ బ్రార్థింతురు అఖండ పరాక్రమోపేతుఁడనై యుద్ధములు కల్పించి రణధూళి నెగురఁగొట్టు వాఁడను నేనే ఇదియంతయు నేనే చేసితిని దేవతలందరేకమై నా ప్రతాపము నెదుర్కొనఁ జాలరు హోమప్రార్థనములచే నేను బలిసి యాక్రమించుచు నుభయలోకములు కంపించును

ఋషి చెప్పుచున్నాఁడు నీవీ కార్యములు చేసితివని యందరెఱుఁగుదురు ఓ రాజా! ఈ సంగతి వరుణునకుఁగూడఁ బ్రకటించితివి వృత్రాసురహంతవో యింద్రా! నీవేయని ప్రజలు స్తుతింతురు శృంఖలాలబ్ధములైన ప్రవాహముల విడిపించువాఁడవు నీవే (౪౮ ౨) తండ్రియైన యసురుని విడిచిపోవుచున్నాను ఎవరికి యజ్ఞహోమములు లేవో వారినుండి యెవనికి హోమములిత్తురో ఆ యింద్రునొద్దకుఁ బోవుచున్నాను చిరకాలము ప్రేమతోఁ గలిసియున్న యసురుని విడిచినాను అగ్నివరుణసోములు తప్పుకొనవలెను అధికారమింకొకనికిఁ బోయినది నేను చూచితిని (౧౦ ౧౨౪) అనంతరము వచ్చిన పురాణములు కృష్ణునకు నింద్రునికిఁ గలిగిన విరోధమునుగూర్చి స్మరించినవి ఋగ్వేదకాలమున నింద్రునిచే జయింపఁబడిన కృష్ణుఁడు నాఁటి గోపాలజాతికి దేవుఁడై యుండవలెను భగవద్గీతకాలమున నాఁటికిఁ బోయిన పదవిని తిరిగి సంపాదించి భాగవతుల వాసుదేవుఁడు వైష్ణవుని విష్ణువునై యుచ్చదశ పొందెను ఇటి భిన్నదశలతోఁ గూడిన చరిత్రము గల కృష్ణుఁడు గీతాప్రవక్తయుఁ బరిపూర్ణావతారము యమునాతీర సంచారియైన మురళీగాన మోహనమూర్తియు నయ్యెను ౧

---

౧ తరువాతఁ గొంతకాలమునకుఁ సర్పపూజ యింద్రపూజ మున్నగు క్షుద్రారాధనములుపోయి కృష్ణతత్త్వ మౌన్నత్యము పొందెను సోదరినివేదిత వ్రాసినది కృష్ణుఁడు కాళీయసర్పము జయించి దాని శిరముపైఁ దన పదాంకమును నిలిపెను సర్పపూజయందు శివుఁడు నాగేశ్వరుఁడని పూజించిన పద్ధతిమండి శివుఁడు పరదైవమని యెంచిన శైవతత్త్వమునకుఁ బెంపొందిన యాపరిణామమునకు నిట్టి పోలికయే యున్నది ఇంద్రునికిఁ జేయు యాగమ్ము గోపకులచేఁ గృష్ణుఁడు మానిపించెను

ఇచట కృష్ణుఁడు వైదికదైవతములను ప్రత్యక్షముగాఁ ద్రోసివేసెను (ఫుట్ ఫాల్సు ఆఫ్ ఇండియన్ హిస్టరీ పుట ౨౧౨)

ఇంద్రునితోఁబాటు వియత్తలమున గోచరించు ననేక దృశ్యముల మూర్తులైన యితర
దేవతలు గలరు వాయుదేవత వర్షదేవతలగు మరుత్తులు మేఘగర్జాదేవతయగు రుద్రుఁడు
గలరు వాయుదేవతను గూర్చి యొక కవి చెప్పినాఁడు జగమునకు బీజరూపము
దేవతలకుఁ బ్రాణమునైన యీ వాయు వెచటనుండి యెప్పుడు పుట్టినది ? తన యిచ్ఛవచ్చిన
చోట సంచరించుచు ధ్వనులు చేయుచుండును కాని యాతఁడు మాత్రము కంటికగపడఁడు
వాతదేవత ఇండో ఇరే యా దేవుఁడు భారతభూమియందు నిత్యదర్శనమిచ్చు తుఫానులకు
దేవతలు మరుత్తులు ౧ అంతరాళము ధూళిచే మేఘములచేఁ జీకటియై ఒక క్షణములో
వృక్షసంపద యదృశ్యమగును శాఖలు విరిగి పలవములు డుళ్ళి భూమి కంపించి పర్వ
తములు చలించి నదులు నురుగలు గ్రక్కుచుఁ గ్రోధఘూర్ణితములగును ౨ మరుత్తులు
బలము గలవి నాశకారకులునైన నొకప్పుడు దయజూపుచు క్షేమకరములగును ప్రపం
చము నన్నిదిశల నుత్పాత లూఁగించి వాయువుమ శుద్ధిచేసి వర్షమునిచ్చును ౩ దివ్యదేవత
లిడలు నింద్రుని యనుచరులు మరుత్తులు కొన్నిచోటుల మరుత్తులకు జ్యేష్ఠుఁడు ౪ యింద్రు
నందురు భీకరదేవతయైన రుద్రునికి భీకరగుణములుగల మరుత్తులు సంతానమందురు ౫
ఋగ్వేదమునందు రుద్రునకు మూఁడు మంత్రములే యిచ్చి మధ్యమపదము నిచ్చిరి
ఎడుగు నాతఁడు చేత ధరించి యాకసమునుండి విద్యుద్బాణపరంపరలఁ గురియును
తరువాత నీతఁడే మంగళకరుఁడగు శివుఁడై గొప్పసంప్రదాయ స్థాపకుఁడగును

ఇదేవిధముగాఁ గల్పితములైన కొందఱు స్త్రీ దేవతలు నిందుఁగలరు ఉషస్సు
అదితి యట్టివారే సింధునది దేవిగా నొక మంత్రమునఁ జెప్పఁబడెను సరస్వతి మొదట
నొక నదీదేవి తరువాత విద్యాదేవి యగును ౬ భాషకు దేవి వాగ్దేవి వనదేవత
అరణ్యాని ౭ తరువాత వచ్చిన శాక్తమతము లీ ఋగ్వేదమందలి దేవులను గ్రహించిరి
వేదకాలము నందార్యులు సర్వకల్మష నాశకమైన దేవునిశక్తి రూపమున నారాధించిరి
రమ్ము ! ఓ దేవీ మాకోర్కెల నిమ్ము ! నీవు బ్రహ్మసమానవై, నాశములేని దానవు

స్థూలమునుండి సూక్ష్మమునకును శరీరమునుండి యాత్మకును బుద్ధి పెంపొందిన
నపుడు వివిధ దేవతానిర్మాణ మెట్లు జరిగెనో తెలియగలదు ఇందుఁ బెక్కుదేవతలు

౧ ౧౬౮ ౩౪ ౨ మ్యాక్సుముల్లర్ ఇండియా వాట్ కెన్ ఇట్ టీచ్ అజ్ఫుట ౧౮౦
౩ ఋ వే భా ౧ ౩౭ ౧౧ ౧ ౬౪ ౧౦ ౨ ౩౪ ౧౨ ౪ ౧ ౬౪ ౨
౫ ఋ వే భా ౭ ౪౬ ౩ ౧ ౧౧౪ ౧ ౬ ౧౦ ౯౫ ౨ ౪ ౬
౭ ౬ ౬౧

ఋగ్వేద దశమ మండలమున నుండుటచే వీరు కొంతకాలమైన వెనుకనే కల్పింపఁబడిరని తోఁచును మన్యువు, శ్రద్ధ మున్నగు దేవుని గుణములును దేవతలైరి

కొన్నివేళల సవితృనితో నమముగాఁ జెప్పఁబడిన త్వష్ట సృష్టికర్తయయ్యెను ౦ ఈ త్వష్ట యింద్రుని వజ్రాయుధమును గల్పించ బ్రహ్మణస్పతి గొడలిని పదును చేసె యందుండి దేవతలు సోమపానముచేయు పాత్రములను దయారుచేసెను ఈతఁడే సర్వజీవములకు రూపములేర్పఱచినాఁడు యజ్ఞములు చేయుటారంభమయిన ఎమ్మట శకమునకుఁ జెందిన దేవత యీ బ్రహ్మణస్పతి మొదట ప్రార్థనాధిపతియై తరువాత యాగదైవమగును పరిశుద్ధ వేదమతమునకును దరువాత వచ్చిన బ్రాహ్మణమతమునకు నీ బ్రహ్మణస్పతి పరివర్తనమును దెలుపుచున్నాఁడు ౨



౯

## ఏకేశ్వర తత్త్వబీజములు

వేదములందలి దేవతాసమూహమును గల్పించిన తత్త్వమునకు భిన్నమైనభావములు ఆర్యేతరప్రపంచమునుండి యెట్లువచ్చి మార్పులుచేసెనవో మన మధర్వవేద పరిశీలనమందుఁ జూడఁగలము దేవీ దేవతలనందఱ నొకచో నిర్మించిన బుద్ధికిఁ గొంతకాలమునకు వినుగు పుట్టినది అందుచే భిన్నగుణములుగల దేవతలకు సమానత్వమారోపించుటో లేక యందరు దేవతల నొక దేవునియందుఁ గలిపవేయుటో ప్రారంభమయినది వీ రాదేవతలను వరీకరణము చేయుటలో వారిసంఖ్య తగి భూమ్యాకాశవాయుత్రయువరముల క్రిందకు మూడు గణములుగా నేర్పడిరి

దేవతల సంఖ్య 333 కాని మూడుచె గుణితమైన యితర సంఖ్యలును గలవు ౨ ఒకే పనిచేయు దేవతల నిరుపురను గలిపి చెప్పుటయుఁ గలదు మఱియుఁ జాలమందినిగలిప విశ్వేదేవ శబ్దముతోఁ జెప్పుటయును గలదు పరస్పర విరోధములు గలిగి పోరాడుచున్న

---

౧ ౩ ౫౫ ౧౯

౨ రాత్ పండితుడు ఎలికినాడు వతి' శబాంతరములుగల దేవతలు తరువాత వచ్చినవారు వారు కేవల సమాలోచనముచేఁ గల్పితులు ఇది పూర్ణసత్యము గాదు పోల్చుటు నాసోఎపతి కిట్ పండితుడిచ్చిన భావము

యనేక దేవతలను వరీకరించు నీ పద్ధతి హేతుబద్ధమున కిష్టమునైయున్నది దీనినుండియే యేకేశ్వర సిద్ధాంతము జనించినది

దేవునిఁగూర్చిన సరియగు భావమున కేకేశ్వరసిద్ధాంతమే పర్యవసానము అనంత రూపులగు నిరువురు పరమేశ్వరులుండుట నంభవము ప్రతిదేవతనుగూర్చి యీతఁడెవనిచే నించె ఎను ప్రశ్నములు ఒయల్వెడలినవి ఇంకొకనికి జనించిన దేవుఁడు దేవుఁడే కాఁజాలడు ప్రకృతి జగద్రహస్యజ్ఞానము పెంపొందినకొలఁది దైవభావ మున్నతి నందినకొలఁదియు దేవతలనందఱ నొక్కదేవునిలోఁ గలిపివేయు యత్నము లారంభించిరవి ఋత భావములోఁ గాంచిన యేకత్వ మేకేశ్వరతత్త్వమునకుఁ ద్రోవఁజూపినది ప్రకృతిలోఁ బుట్టిన నానాదృశ్యములకు నానాదేవత లుండవలెనవచ్చుచోఁ బ్రకృత్య తరాళమున గోచరించు నేకత్వమున కనుగుణముగా సర్వదృశ్యముల నావరించు నొకే దేవుఁడు కూడ నున్నాఁడని యూహించు టవసరముకాదా? ఏకమైన ప్రకృతినియమమును నమ్మినచో నొకే పరమేశ్వరుని నమ్మక తీరదు ఇట్టి యేకదైవ భావాభివృద్ధి మూఢవిశ్వాసములకు స్వస్తి చెప్పఁగలుగును ఒక నియమావళి ననుసరించి నడచు ప్రకృతినిర్మాణమునందుఁ గారణములులేని వైచిత్ర్యముల కవకాశములేదు అనేకదేవతల నూహించు పద్ధతి మూఢవిశ్వాసమునుండి వైచిత్ర్యములందు నమ్మకమున్న లఘు బుద్ధినుండియు జనించును వరుణో పాసనమునందు మన మేకేశ్వరభావమున కత్యంతసమీపమునకు వచ్చితిమి నైతికాధ్యాత్మిక గుణసంపత్తిలోఁ జేరు ధర్మదయా వాత్సల్య ఋజుత్వాదు లాతనికారోపించిరి బాహ్యస్థూల భావములు క్రమముగాఁ దొలఁగి అంతరంగిక సూక్ష్మభావములు వృద్ధిపొందెను మానవులు ప్రకృతి యిహపరలోకములు వరుణునధీనములో నున్నవి వరుణుఁడు కేవల బాహ్యశుద్ధియేకాక, అంతశ్శుద్ధినిగూడ వాంఛించును అనేక దేవతల మధ్యమందొకఁడు పరదేవతయను భావము వేదములలో నున్నది మతాభిరుచి కలిగినవారి కిదియే యేకేశ్వరవాదబీజము ఈ భావము మాక్సు ముల్లరు సూచించినది ఏ దేవత నారాధించినపుడా దేవతయే దేవతాశ్రేష్ఠుఁడనియు నతఁడే యేకైక దేవుఁడనియు నారాధింపఁబడెను కాని యిది స్వవిఘాతమైన సిద్ధాంతము పలువు రీశ్వరు లనేకులున్నారనుట సమరింపఁజాలము ఇది మతజిజ్ఞాసకు వ్యతిరేకము అనేక దేవతోపాసన మేక దైవతోపాసనమునకుఁ బోవు మార్గమునకై చేయు ప్రయత్నము దుర్బలమైన మానవశక్తి యింకను దనకుఁ గావలసిన వస్తువుకై వెదకుచున్నది వేదకాలమందలి యార్యుఁడు సృష్టిరహస్యము నెఱుఁగఁ గోరినాఁడు తెలిసిన భావములు తృప్తినొసఁగలేదు పరమదైవమని నమ్మిన పెక్కురు దేవతలు గలరనగా నున్నారు తాత్కాలికముగా నొక్కనిని శ్రేష్ఠుఁడనుచున్నారు ఒకఁడు శ్రేష్ఠుఁ

డన్నను నితరులు లేరనులేదు సామాన్య దేవతలుకూడ నొకప్పు డగ్రస్థానము వహించిరి కవియొక్క అవసరము భక్తి ననుసరించి దేవతల పదవులు మాఱినవి ఆకాశము వరుణుఁడు భూమి వరుణుడు అంతరాళము వరుణుఁడు విశ్వమంతయు వరుణుఁడు సర్వము వరుణుఁడే కొన్నివేళల అగ్నియే సర్వదేవతా స్వరూపి కొన్నివేళల ఇంద్రుఁడు దేవతలందరికంటె నధికుఁడు ఒక్కొక్కవేళ ప్రతిదేవతయు నితర దేవతలందఱను గలిపి తీసిన ఛాయాపటము దేవునకు మానవుని సంపూర్ణాత్మ సమర్పణము మతానుభవజ్ఞానములోఁ బ్రధానవిషయము దేవుఁ డొక్క పరమేశ్వరుఁడైనప్పుడే యిది సాధ్యము అందుచే నొకే దేవుఁడు సర్వదేవతలకు శ్రేష్ఠుఁ డనునది మతవిజ్ఞానమునకు సహేతుకమైనది సర్వదేవతలలో నొకఁడు శ్రేష్ఠుఁడను నీ మతమన్నిటియందు దైవత్వ మారోపించి విసుగుచే నిట్టి రూపమును కల్పించినది దేవతలలోఁ దరతమ భావముల క్రమముగా సృష్టించినది ఇది యవసరోచితమగు నేకేశ్వరవాదమునకు దారి చూపినది ప్రతిదేవతయు సార్వభౌమత్వము నొకసారి పొంది యొకఁడును నిలుపుకొనఁ జాలఁడ ని వ్రాసిన బ్లూమ్‌ఫీలు పండితుని వాదము సహేతుకము కాదు ౧

ప్రతిదేవతయు విశ్వకర్తయనియుఁ బ్రజాపతియనియు నూహింపఁబడినప్పుడు వారికిఁ గల ప్రత్యేక లక్షణముల నుజ్జగించి సర్వసామాన్య లక్షణముల నొక పరమదేవత మందుంచి యేకేశ్వరత్వమును బ్రదర్శించుట కష్టమైన పనికాదు

వరుణారాధనమందు మనకుఁ జూపట్టిన క్రమాభివృద్ధినందిన యేకేశ్వరభావము సమానములైన దేవతాలక్షణములొకే దేవునియందుఁ బూర్ణముగాఁ జూచు మతానుభవ క్రమము ప్రకృత్యభ్యంతరమున నున్న ఋత రూపమునఁ దెలిసిన యేకత్వము ననేకత్వమునుండి యేకత్వమును సాధింప యత్నించు మానవ సహజప్రకృతి — యివన్నియుఁ గలిసి అపరిపక్వమైన ప్రకృతి దేవతారాధనమునుండి పరిపక్వమైన తత్త్వజ్ఞానమును ప్రదర్శించు నేకేశ్వరభావమునకుఁ గ్రమాభివృద్ధి జయప్రదముగా నెరవేరియున్నది నాఁటి వేదద్రష్టలు సర్వసృష్టి కారణభూతుఁడు నజుఁడు నవినాశియు నగు నొక ప్రథమకారణ రూపుఁడగు భగవానునిఁ దెలియు కొఱకై యత్నించిరి ఇతర దేవతల నందర నొక శ్రేష్ఠ దైవతమునకుఁ బరివారముగా నొనర్చి వాని యాజ్ఞలో వీరందఱు లొంగియుండు నట్లూహించుట సులభమైన పద్ధతి పరమేశ్వరు డొకఁడే యుండవలయు ననియెడు వారికాంక్ష తృప్తియైనది మఱియు సంప్రదాయమును బూర్తిగా దిగఁద్రొక్క నవసరము లేకుండ నితర

౧ ది రెలిజియన్ ఆఫ్ ది వేద పుట ౧౯౯

దేవతలను గూడ నుంచిరి  భారతీయ సమాలోచన మెంత సాహసాంచితమైనను గారిష్యము క్షుద్రత్వము నది ప్రదర్శించి యుండలేదు  ప్రజాదరాభిమానములను మననువం దుంచుకొని కొన్ని విరోధ భావములకు సామరస్యము కల్పించుట కంగీకరించినది  కాని తర్కము దయాశూన్యమైనదియు  సునిశితమైనదియు నగుటచే — హిందూమతము పరభావముల యెడ(జూపిన సహనసమరసదృష్టిచే నేడు హిందూమతమన(గా ననేక తత్త్వములు  ననేక మతములు  గాథలు  కల్పనములతో నిండిన యొక కలగూరగంప యైనది  సర్వాత్మశక్తి యగు నొక్కదేవుని వివిధగుణముల మూర్తులే వివిధ దేవతలని భావించిరి  సార్వభౌము(డైన పరమేశ్వరుని శాసనము నంగీకరించి  అన్యదేవతలు  వారి వారి సీమల( బాలించు చుండిరి  వారు  ఒకే చక్రవర్తి క్రిందనుండు సామంతులవలె  పరమేశ్వరు(డిచ్చిన యధికార పదవులకు( బ్రతినిధులే కాని స్వతంత్రులు  గారు  తమ యిచ్చవచ్చినట్లు విహరించు ప్రకృతి  దేవతలు  తమ స్వేచ్ఛను గోల్పోయి  ఏకచక్రాధిపత్యము క్రింద( బెక్కు నిర్ణీత బాధ్యతలు  గల  సామంత  దేవతలైరి  ఇంద్రవరుణాది బృహద్దేవతలును బెద్ద సామంతులే గాని స్వతంత్రరాజులు  గారు  ఋగ్వేదములో( జివర  మండలములలో నుత్తమ పదవి  విశ్వకర్మ  కీయ(బడినది ౧  విశ్వకర్మ సర్వతోముఖ నేత్రపాదు(డై ఉభయలోక కర్తయై సర్వలోకజ్ఞు(డై మనుష్యజ్ఞానాతీతు(డై వెలయుచున్నా(డు  ఈ పదవికి బృహస్పతికి(గూడ నధికారము గలదు ౨  కొన్నిచోట్ల( బ్రజాపతికి నీ యదృష్టము పట్టినది ౩ సర్వకర్తయైన పరమేశ్వరు(డుగా హిరణ్యగర్భుని ౪  కూడ నచటచట( జిత్రించిరి

~~~~~~

## ౨

## ఏకేశ్వరవాదము  బ్రహ్మైకవాదము

వేదమంత్రముల కాలమునవైనను( కేవలాకాశహర్మ్యముల నిర్మించు నూహాకల్పన బుద్ధియే కాక తఱచుగా ప్రశ్నించి తర్కించు చిత్తవృత్తి ప్రదర్శనముల వలన నా(టి యార్యులకు సమ్యగాలోచనము సత్యాన్వేషణ దృష్టి గలవని ఋజువగుచున్నది  కనవడు చున్న దృశ్యములను గేవల దృశ్యములనుగా గ్రహించుట కాక  వాని నర్థము చేసికొన వలయునను లక్షణము గలిగిన  వారగుటచే నార్యులు బహుదేవతానిర్మాణము చేయవలసి

---

౧ ౧౦ ౮౧ ౮౨  ౨ ౧౦ ౭౨  ౩ ౧౦ ౮౫ ౪౩  ౧౦ ౧౮౯
~~~~~~

వచ్చినది రాత్రివేళ సూర్యుఁ డెచట నుండును? ఎగటివేళ నక్షత్రము లెచటికిఁ బోవును? దివారాత్రములలో నేదిముందు వెనుకయేది? సూర్యుఁ డాకసమునుండి యేల పడిపోఁడు వాయు వెచటనుండి వచ్చి యెచటికిఁ బోవును? ౧ భయాశ్చర్యములతోఁగూడిన యిట్టి ప్రశ్నము లే సర్వశాస్త్రములకుఁ దత్త్వములకు జన్మస్థానములు మఱియు జన్మసహజమైన జ్ఞానపిపాస యార్యులలో ననేక రూపములు దాల్చినది బహుదేవతా కల్పనము జరిగినది కాని యిట్టి బహుదేవతాకల్పనముచే మానవ మానసము తృప్తిపొందఁజాలదు ఇందఱు దేవతలలో నిజదైవ మెవరను సందేహము బయలు దేఱినది కస్మై దేవాయ హవిషావిధేమ ఏదేవునకు మేము హోమము లర్పింపవలెను ౨ దేవతలెటి అపరిణతబుద్ధి సంజాతులో స్పష్టమగు చున్నది నూతన దేవతలు భరతవర్షమున నుదయించిరి కొందఱను దేశీయజాతుల మతములనుండి స్వీకరించిరి అచంచల విశ్వాసము గలవారు మమ్ము విశ్వాసముగలవారిగాఁ జేయుమని ప్రార్థింప నవసరముులేదు ౩ సంశయము వాతావరణములో నున్నది ఇంద్రుని యునికి సర్వాధిపత్యము శంకింపఁబడినవి ౪ ఈ దేవతల సందర్భమంతయు నభూత కల్పనమను నాస్తికతత్త్వము విజృంభించుచునే యున్నది నామరూప నిర్ణయములు లేని దేవతల నుద్దేశించి మంత్రములు కొన్ని యున్నవి ఈదేవతల అస్తమయ పూర్వప్రదోష కాంతులు కనఁబడుచున్నవి వారు నెమ్మదిగా నదృశ్యు లగుదురు ఉపనిషత్తులో నీ ప్రదోషకాంతి నిశీథమైనది ఎవరో కొలదిమంది స్వప్నజీవులకుఁ దప్ప నీ దేవతలు లేరు ఏకేశ్వరభావము ప్రబలిన కాలము నందలి పరమేశ్వరుఁడైన నుపనిషత్తులలో విమర్శా తీతుఁడుగ నుఁడు మానవమానసమునకుఁ బ్రకృతి దేవుఁడెవఁడును సంతృప్తి నొసఁగ లేదు దేవతలందఱ కధిపతియై యొక దేవతా సార్వభౌముఁ డున్నాఁడనిన నంతటితోఁ బ్రశ్న లాగిపోవు మొదటఁ బుట్టిన వాని నెవఁడు చూచెను? రూపము లేనివాఁడు సరూప నెట్లు పుట్టించెను? జగత్తుయొక్క ప్రాణము రక్తము చిత్తము నెచటనుండి వచ్చినవి? ఈ సంగతి నెఱిగిన వాఁడెవఁడు? వాని నడిగిన వాఁడెవఁడు? ఇదియే తత్త్వశాస్త్రముల యమన్య జగత్సత్యమేమి? కేవల విశ్వాసము నిష్ప్రయోజనము ఏది సత్యదారమో దానిని మన మనుభవములోఁ దెలిసికొనవలెను అందుచేఁ బ్రశ్న మేమనఁగా మొదటఁ బుట్టినవాని నెవరు చూచిరి? జిజ్ఞాసగలవారు పరమసత్యముకొఱకే చూచిరి కాని విశ్రాంతి సుఖములకొఱకుఁ జూడలేదు నీవు దేవునొక మూఢజాతివానివలెఁ గ్రోధరోష పరీతునిఁగాఁ జూచినను లేక యొక నాగరికత గలవానివలెఁ సృష్టికర్త యనియు జగత్ప్ర

౧ ఋ వే ఖా ౧ ౨౪ ౧౮౫ ౨ ౧౦ ౧౨౧ ౩ ౧౦ ౧౨౯
౪ ౧౦ ౮౦ ౧ ౬ ౧౦౦ ౩ ౨ ౧౨ ౫

భువనియు దయానముద్రుఁడనియుఁ పిలఁచినను వేదియును విమర్శకు నిలువఁజాలని యల్పభావమే ప్రకృతిగుణములు గల దేవుని భావము పోవలెను ఇట్టి భావము దేవుని పేరఁ గొన్ని కల్పిత రూపముల నిచ్చునేకాని యదార్థ నిగవానునొనఁగఁ జాలదు మన ప్రాణమునకుఁ బ్రాణమైన దేవుని మనము నమ్మవలెను కాని మనుష్యుల భావములచేఁ గల్పితమైన అంత్య దైవమును గాదు సర్వదిశలనుండి మనల నావరించుయున్న ఆద్యంత రహితమైన జ్యోతిర్మయుఁడు దేవుఁడు ప్రాణో విరాట్ అనఁగా అపరిచ్ఛేద్యమైనది ప్రాణము అందు మన యాలోచనములు మంచే నాలోచింపఁబడిన వస్తువులుకూడ నున్నవి అట్టిది భిన్నరూపములలో గోచరించును అది అద్వితీయము అవక్రము అనాద్య నంతము దుస్త్యాజ్యము సర్వశక్తికలితము దానినుండి సర్వము బయల్వెడలును సర్వము నందే జేరును రూపవంతుఁడైనదేవుఁ డుద్రేకభావములుగలవారి కెంత యవసర మైనను సత్యకాంక్షికి ప్రమాణము వేఱు అతఁడు ప్రార్థించు దేవునిలక్షణము వేఱు సత్యమెంత యనుద్రేకమైనది దూరమైనది నిరుత్సాహభయకారణము నైనను నది సత్యము కాకపోదు నేఁటికి నధిక సంఖ్యాతమైన మానవజాతి కేకేశ్వరత్వమే రుచికరమై యున్నను నది వైదికవిజ్ఞానిశేఖరులకు సంపూర్ణ సంతృప్తి నొసఁగలేదు

పరమసత్యము పుంస్త్రీలింగాది భేదాతీతమని చెప్పుటకు సత్ శబమును వాడిరి అట్టి సత్పదార్థమునకు వరుణాగ్నింద్రాది దేవతలు వివిధ నామ రూపములే యని వారు నిశ్చయించిరి ఎదియో యొక సత్పదార్థమున్నది అది యద్వితీయము నామగుణరూప వాతము చరాచర సృష్టిజాలమును బాలించునది సదుచుచున్న గాలిలో నెగురుచున్న సర్వజీవరాశిని శాసించునది మానవజన్మముంంటె విలక్షణమైన జన్మముకలది ౩ యని నిర్ణయించిరి సత్పదార్థ మొకటె పండితులు దాని నేక నామములతో నగ్నియముఁడు మాతరిశ్వానుఁడు నని పిలుచుచున్నారు ౪ నక్షత్రమయాకాశము విశాల పృథ్వీసాగరభూధర ములు నన్నియు నొకే మనస్సుయొక్క కార్యములు ఒకే ముఖముయొక్క లక్షణములు ఒకే వృక్షముయొక్క పుష్పములు ఒకే దివ్యపురుషుని లక్షణములు అవినాశమైన దేది యున్నదో దానిమూర్తులును ఛాయలును అదియే ఆదియందున్నది మధ్యమందున్నది అంతమందున్నది అంతము లేనిది ౫

---

౧ రా వే భా ౧ ౪ ౧౬౪ ౨ కోదదర్శ ప్రథమాం జాయమానమ్
౩ ౩ ౫౪ ౮ ౪ ఏకమ్ సద్విప్రా బహుధా వదంతి అగ్నిర్యమమ్ మాతరిశ్వాన మాహుః (౧ ౧౬౪ ౪౮) ౫ వడ్స్వర్తు ప్రెల్యూడ్ ౬

ఈ సత్ వస్తువు విశ్వమున కంతరాత్మ విశ్వస్థితి హేతువు ప్రకృతి ప్రాణము పరివర్తనములేని శక్తి అది భూమియుఁగా దాకాశమును గాదు సూర్యరశ్మియుఁ గాదు ఝుంఝూనిలయమును గాదు అది యింకొక దివ్యశక్తిసారము ఋతమునకు మూల రూపము అదితి యాత్మరూపము అచలమై చలించునది ౧ దానిని మనము చూడఁజాలము వర్ణింపఁజాలము సత్యార్థమైన ఋజుబుద్ధితోఁ గవి ఈ వసుజగజాలమును సృజించగ యాతని వెన్నఁడుఁ జూడఁజాల మని ముగించుచున్నాఁడు అజ్ఞానముచే మూర్ఖుడైన దేవతల రహస్య జన్మస్థలములను గూర్చి యడుగుచున్నాను నేను తెలియని వాఁడనై తెలిసిన మహర్షులను దెలియఁగోరి ప్రశ్నించుచున్నాను ౨ ' సర్వవస్తు జీవసంతతిలోనుండి వానిని జలింపఁ జేయుచుఁ బుష్పములో వికాసము మేఘజాలమందలి సొగసై తుఫానుగాలిలోని బలమై యాకాశమందు నక్షత్రములను స్థాపించిన దదియే దేవతలందఱిలో స్థిరసత్యరూపుఁడగు పరమేశ్వరుఁ డొక్కఁడే యను భావము ధ్యానదృష్టిచే లభించినది ఇది యాశ్చర్యకరమైన పరిశోధనమే మానవజాతియొక్క బాల్యావస్థలో నిట్టి మహత్తర సత్యము కనుఁగొనుటచే మన కేది వరనాతీతమగు నాశ్చర్యమును గొలుపఁగలదు ఇట్టి పరమసత్యకాంతిలో ఆర్యద్రవిడులకు జ్యూలకు వారి విద్వేషులకు హిందువులకు ముసీములకు క్రైస్తవులకు నాస్తికులకు మధ్యమందున్న యీ వరణభేదములన్నియు మాయమగును తాత్కాలికముగా నైనను మనమొక దివ్యాదర్శనమును గాంచిన దృష్టితో నున్నాము ఇందు లోకములోని సర్వమతములు నొక పూర్ణజ్ఞానముగల దినము వచ్చితీరునని చెప్పు ఛాయాచిహ్నములే ఒకటే యనేక నామములతోఁ జెప్పఁబడుచున్నది పండితులు కవులు నొకటై గూఢమైన పరమసత్యమును మాటలచే బహువిధములఁ జెప్పుచున్నారు ౩ ' ఈ పరమసత్యమును గూర్చి మానవుఁ డసంపూర్ణభావములను గలిగియుండుట సహజము మానవుని కాంక్షలు ప్రమాణములేని యీ యల్పభావములనే విగ్రహములను వలెఁ బూజించి తృప్తినందును పరమసత్యము నూహించి కల్పించుకొనిన మానవుని రూపములతోఁ బోరాడుట పద్ధమౌఢ్యము ఒకే పరమేశ్వరుఁడు దాను జూపు ననేక ప్రదర్శనములవలనను జిజ్ఞాసువుల అభిరుచి వైవిధ్యముచేతను భిన్ననామములచేఁ బిలువఁబడుచున్నాఁడు ఇది ప్రజాభిమతమున కనుగుణమైన సామరస్య విధానము తలఁపవలదు ఇది పరమసత్యమును గూర్చి

౧ ౧౦ ౧౨౯ ౨

౨ రా వే భా ౧౦ ౧౨౦ ౧౧ ౮౨౪ ౧ ౧౬ ౪ ౫-౬

౩ ౧౦ ౧౧౪ చూడు యజుర్వేదము ౩౦ ౨ ౪

చూడు యాస్కాచార్యుని నిరుక్తము ౪ ౫

యావిష్కృతమైన పరమతత్త్వరహస్యము ఇజరేలున కట్టి సత్యమే స్ఫురించెను నీకు దేవుఁడైన పరమేశ్వరుఁ డొక్కఁడే పూటార్కిట్లు నుడివినాఁడు అన్ని దేశములకు నొకఁడే సూర్యుఁడొకే యాకాశమున్నటే ఒకే దేవుఁడు పెక్కు నామములు గలిగియున్నాఁడు

హే భగవాన్! అనేకనామములచేఁ బేర్కొనఁబడు దివ్యపురుషుఁడవు ప్రకృతి కధిపతివి ఎన్ని యుగములు గతచినను మార్పులేనివాఁడవు సర్వశక్తియుతుఁడవు నీ శక్తిచే ధర్మమును బాలింతువు జయము! జ్యూస్‌దేవా! సర్వదేశములలోని సర్వజీవులు సర్వకర్తలైసి నీ దయ కెదురుచూచుచున్నారు ౧

ఈ ఋగ్వేదమందలి యేకేశ్వరతత్త్వమును గూర్చి డ్యూసెన్ పండితుఁ డిట్లు వ్రాసెను ఇతర దేశములవారికి విలక్షణమైన పద్ధతి ననుసరించి హిందువు లీ బ్రహ్మైక వాదమును గనుఁగొనిరి ఈజిప్టు దేశములో ఎంధదేవతలను సమానులనుగాఁజేయు వివేక శూన్యమైన పద్ధతిచే నేకేశ్వరభావము కలిగినది పాలెస్టీనాలో నొకదేవుని జెహోవాను గౌరవించి తక్కిన దేవతలనందఱను బలవంతముగా నిర్మూలించి యా దేవతలను బూజించువారిని జెహోవాకు బలియిచ్చిరి భరతవర్షమున నీ యేక బ్రహ్మవాదము అనేకత్వమను తెరమఱుగున నేకత్వమును జూచి గ్రహించిరి ౨ మ్యాక్సు ములరు వ్రాసినాఁడు ఋగ్వేదసంహిత సంకలనము చేసిన కాలమేదియైనను దానికిఁ బూర్వమే సత్యస్వరూపయైన దేవుఁ డొక్కఁడనియు వాతఁడు స్త్రీయుఁ బురుషుఁడును గాఁడనియు మానవప్రకృతి ననుసరించు వ్యక్తిత్వమునకు గల నియమసంబంధనముల కతీతుఁడైనవాఁడనియు నైనను ప్రజాపతీంద్రాగ్ని మాతరిశ్వానులను వివిధ నామములచేఁ దెలియఁబడువాఁడనియు గ్రహించిరి నిజముగా వేదమహర్షులు సంపాదించిన బ్రహ్మైకతత్త్వము తరువాత నొకప్పు డల్జెగ్జాండ్రియాలోని క్రైస్తవ తత్త్వవేత్తలు గాంచిరి కాని నేఁటికైనను దాము క్రైస్తవులమని చెప్పుకొను చాలమంది కీ తత్త్వము సరిగాఁ దెలియదు ౩

ఋగ్వేదములోని కొన్ని పరిణతిగాంచిన మంత్రములలోఁ బరమాత్మ వాఁడని కాని అది యనికాని చెప్పఁబడినది ప్రాచ్య పాశ్చాత్యతత్త్వశాస్త్రములకు రెంటికిని సామాన్యలక్షణమైన యేకేశ్వరభావమునకు బ్రహ్మైకవాదమునకును మధ్యమందుగల సంశయాందోళనము మొట్టమొదటిసారి తత్త్వచరిత్రములో నిచట గోచరించుచున్నది తత్త్వ

౧ ది హిమ్ ఆఫ్ క్లియాంథిస్

౨ ఔట్లైన్సు ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ పుట ౧౩

౩ మ్యాక్సుముల్లరు షడ్దర్శనములు పుటలు ౯౧ ౯౨

శాస్త్రము చెప్పు నామరూపగుణరహితమై శుద్ధమైన పరమసత్యమే ఉద్రేకావేశములు గలిగిన హృదయచలన మున్న మానవునిచే మృదుమధుర దయాసాగరుడని పూజింపబడును

ఇది తప్పనిసరియైనది మతదృష్టి సంభాషణరూపముగా నుండును జీవాత్మ పరమాత్మలకు సంబంధరూపమగును పరిణతుడైన మానవున కతీతమైన యపరిమిత వ్యక్తిగా దేవుని యూహించుట సహజము కాని యీ యనేకముతోబాటు దేవు డొకడను భావము తత్త్వశాస్త్రమున సమగ్రభావము కాదు తర్కమును దుదివఱకు లాగుకొనిపోవు తీవ్రహేతువాదుల నటుంచి మిగిలినవారి కుపాసింపదగిన దైవమూర్తి లేనిదే మతము లేదు తత్త్వవేత్తయైనను దాను జూచిన పరమసత్యమును నిర్వచింపుమన్నచో నప్పుడాతడు ఉపయోగింపవలయు శబ్దములు భావములు రూపగుణములు గలిగియుండక తప్పదు పరమసత్యమైన పరమాత్మ మనోవాగగమ్యమైన యనంతరూపమును మానవుని పరిమితశక్తులు పూర్తిగా నెన్నడును గ్రహింపజాలవని యెఱుగును అయినను నా పరమాత్మను దనకున్న యల్పశక్తితో వర్ణించుకొనక తప్పదు సర్వవస్తుసంతతిలో నంతర్యామియై సర్వాకారుడై పరిపూర్ణుడై అనంతుడైన యాతని గూర్చి తన యల్పబుద్ధికి సాధ్యమైన యల్ప భావములను మానవుడు కల్పించుకొనును ఆత్మసంతృప్తికై మానవుడు కొన్నిరూపములు గల్పన చేసికొనును రూప మనంతతత్త్వమునకు లోపమును గూర్చునుగాని రూపము లేనిదే ప్రార్థనము లేదు మూర్తిమంతుడైన దేవుడున్నాడనగా వాని నారాధించువాడు నుండుటచే నాత్మానాత్మలు భిన్నమైయుండక తప్పదు కాని సత్య' దార్థములో నీ భిన్నత్వ మేకత్వమైపోవలయును కావున మూర్తిమంతుడైన దేవుడు పూర్ణసత్యపదార్థము యొక్క యత్యుత్తమమైన చిహ్నము రూపములేనివానికి రూపమును నిర్గుణునకు గుణమును సర్వవ్యాపకునకు దేశత్వమును గల్పించితిమి పరమాత్మునొక మూర్తిగా జేసినంతనే యది పరమాత్ముని పూర్ణత్వమును దగ్గించును పరిమితమైన మనస్సుతో సంబంధముండవలెనన్నచో దేవుడు పరిపూర్ణుడుగానుండుటకు వలులేదు కాని పరిపూర్ణతలేని దేవునారాధించు టుత్తమమతము కాదు అనగా దేవుడు పరిపూర్ణుడైనచో మతములేదు దేవుడసంపూర్ణుడైనచో మతము పూర్ణఫలకారి కాదు పరిమితశక్తిగల దేవునారాధించి మనము శాంతి సౌఖ్యములను విజయ విఖ్యాతులను పొంది తుదకు మోక్షాపేక్ష నిస్సంశయముగా గలిగియుండజాలము నిజమైనమతము పరిపూర్ణుడైన దేవునిగోరును అందుచే జనసామాన్యమునకు దృప్తియగుటకు తత్త్వశాస్త్రమునకు సరిపడుటకు నా పరమసత్యమును వాడు అది యని రెండుశబ్దములతోడను సంబోధించిరి ఉపనిషత్తులలో నిటే యున్నది భగవద్గీతలోను వేదాంతసూత్రము లందును నిటేయున్నది ఇది ప్రజాభిప్రాయమున

కనుగుణముగా నెఱిఁగిచేసిన సంధి సూత్రమనికాని సామరస్యమనికాని తలఁపవసరము లేదు బ్రహ్మైకతత్త్వము ననుసరించి మహోన్నత మతారాధనవిధానమును సమర్థింప వచ్చును పూజాప్రార్థనములకు బదులు పొంగిపొరలు రోమాంచమును గలుగఁజేయు ప్రేమమయమైన ధ్యానసాధనముండగా భగవంతునకుఁ దదంశమునకు మధ్యమందుండు ప్రేమభావ ముత్తమభక్తిగాఁ బరిణమింపఁగలదు అట్టి పరభక్తియు ధ్యానమును సర్వము నావరించుచు సత్సౌందర్యములతో ననుభవింప యానందమీయఁగలదు ఇట్టి మత మనుభవజ్ఞానశూన్యులకు రసహీనముగను గల్పితముగను దోఁచవచ్చునుగాని తదితరమైన యేమత తత్త్వముగాని తత్త్వజ్ఞానము ననుసరించి నిలువఁజాలదు

భూమిపైఁ బుట్టిన సకల మత విధానములును మానవహృదయావసరమును గుర్తించినవి తానాధారపడఁగల తన కంటె సున్నతమైన యొక శక్తిని మానవుఁడు గోరి యారాధింపఁ జూచును వేదమతములోని వివిధ దశలలోఁ గల్పితులైన దేవతలు పెంపొందుచు వచ్చిన మానవుని యవసర కాంక్షల యొక్కయు మానసికాన్వేషణముల యొక్కయు హృదయ పిపాసల యొక్కయుఁ బ్రతిబింబములు కొన్ని వేళల మానవుఁడు తన ప్రార్థనముల విని తన పూజల నంగీకరించి తన కోరిక లిచ్చు దేవతలను గాంక్షించెను అట్టివారును గలరు మఱియు ప్రకృతి శక్తి మూర్తులగు దేవతలును గలరు ఈ యీ దేవత లందఱు నొకే పరమాత్మ యొక్క భిన్న రూపములని యెంతగా సమర్థించినను మానవుని యత్యుత్కృష్ట సమాలోచనము సంతృప్తి పొందలేదు దేవతల మూకయందు వెదజల్లఁబడిన వివిధ భావ కిరణములను సేకరించి పేరులేని యొక దుర్నిరీక్ష్య తేజోనిలయుఁడైన పరమేశ్వర భాస్కర భావములో లయింపఁ జేసి అశాంత్య విశ్వాసములచేఁ గొట్టుకొనుచున్న మానవ హృదయమునకుఁ దృప్తి కలుగఁజేయఁ జూచిరి వేద జిజ్ఞాస పరిపూర్ణ సత్య దర్శనమగు వఱకును దృప్తి పొందలేదు వేదమంత్రములలోఁ గల్పింపఁబడిన దేవతలను గూర్చిన మత భావపరిణామము నిటు వర్గీకరింప వచ్చును (౧) ప్రకృత్యుపాసన రూపమైన ద్యౌదేవత, (౨) ధర్మ తత్పరుఁడై తరువాత వెలసిన వరుణుఁడు (౩) జయాక్రమణ యుగమున స్వార్థముల సమకూర్చు దేవేంద్రుఁడు (౪) ఏకేశ్వరవాదుల ప్రజాపతి: (౫) పై చతుర్విధ భావముల యొక్క పరిపూర్ణతకు రూపమైన పరబ్రహ్మము ఇట్టి వర్గీకరణము సహేతుకము సహజ వికాస క్రమానుగుణమునైనది వేదమంత్రములు మాత్ర మీ భావముల నొక క్రమములోఁ జెప్పక వివిధ భావము లనేక స్థలముల మేళవించి యున్నవి కొన్నిచోటుల నొకే మంత్రమున నిన్ని భావములును గలవు వేద మంత్రములను సంకలనము చేయుటకుఁ బూర్వమే యీ భావములన్నియుఁ జక్కగాఁ బెం

పొందియున్నవనియు నాఁటి యార్యులు వీనిలోఁ గొన్నిటిని గాని యన్నిటిని గాని నమ్మి వీనికిఁ బరస్పర వైరుధ్యమున్నదని యూహించియుండరు

---

౫

## సృష్టి తత్త్వము

సృష్టి కారణ స్వరూప సమస్యలను గూర్చి వేదద్రష్టలాలోచింపకుండ విడిచిపెట్టి యుండలేదు పరివర్తన మందుచున్న సకల వస్తుజాలమునకు మూలభూతము గనుఁ గొనుటలో ప్రాచీన గ్రీకుల వలెనే ఆర్యులును వాయుజలాదికములఁ బేర్కొనిరి సంవత్సర (కాల) శక్తిచేఁ గాని కామముచేఁ గాని ప్రజ్ఞచేఁ గాని తపస్సుచేఁ గాని జలము ప్రపంచముగా మారినదని చెప్పఁబడెను ౧ కొన్ని చోటుల జలము తమస్సు నుండి కాని వాయువునుండి కాని జనించిన దనరి ౨ ౧౦వ మండలము ౧౨౯వ మంత్రములో ననంతము నదితి స్వరూపమునైన అసత్తునుండి జగముద్భవించిన దని చెప్పఁబడినది అనంతమైన వస్తువునుండి జగచ్ఛక్తి యుద్భవించినదని యొకచోటను జగచ్ఛక్తియే యా మొదటి యనంత వస్తువున కాధార భూతమని యొక చోటను జెప్పఁబడెను ౩ ఈ సిద్ధాంతములు క్రమముగా మత సిద్ధాంతములుగా మాఱి రెండును మేళవించి సృష్టి తత్త్వ నిరయములు బయల్వెడలినవి

బహు దేవతారాధన కాలమున వరుణేంద్రాగ్ని విశ్వకర్మలు సృష్టికర్తలని వరుసగాఁ జెప్పఁబడిరి ౪ సృష్టి క్రమమునకు భిన్న విధానము లున్నవి ఒక వడ్రంగి యిల్లు కట్టినట్లే ప్రపంచమును గొందఱు దేవతలు నిర్మించిరని యున్నది ప్రపంచ నిర్మాణమునందుఁ గావలసిన కలప నిచ్చిన చెట్టేది యని ప్రశ్నమున్నది ౫ తరువాత పరబ్రహ్మమే యట్టి వృక్షము నట్టి వృక్షమునుండి భూస్స్వర లోకములు కటఁబడినవని చెప్పఁబడినది ౬ పరిణామోచితక్రమము ననుసరించికూడ జగన్నిర్మాణ విధానములు పేర్కొనఁబడినవి ౭ కొన్నివేళల దేవతలు యజ్ఞమునుండి సృష్టిని జేసిరని యున్నది ఈ భావము తరువాత దశకుఁ జెందినదై యుండనగును

---

౧ ౧౦ ౧౯౦ ౨ ౧౦ ౧౬౮ ౩ ౧౦ ౭౨౩
౪ ౭ ౮౬ ౩ ౩౨ ౮౦ ౧౦ ౮౧ ౨ ౧౦ ౭౨ ౨ ౧౦ ౧౨౧ ౧
౫ ౧౦ ౩౧ ౭ ౧౦ ౮౧ ౪ ౬ చూడు తైత్తిరీయబ్రాహ్మణమ్ ౭ ౧౦ ౧౨౭ ౧

ఏకేశ్వర వాదకాలమునాటికి దేవుడు తన స్వరూపము నుండియే జగమును సృష్టించెనా? లేక తనకు వేఱై యెల్లప్పుడు నున్న పదార్థమునుండి యీ సృష్టిని గల్పించెనా యను ప్రశ్న బయలు దేఱినది మొదటది బ్రహ్మైక వాదమునకును రెండవది ఏకేశ్వర వాదమునకును జెందును రెండును వేదమంత్రములలోఁ గలవు దశమండలమున ౧౨౧ వ బుక్కులో శాశ్వతస్థితి గలిగిన పదార్థమునుండి జగమును దేవుఁడు సృజించినాఁడని వర్ణింపబడినది విశ్వమంతయు నిండియుండిన జలమునుండి హిరణ్యగర్భుఁడు మొదట బయల్వెడలి రూప రహితమైన యొక ప్రళయ స్థితినుండి యందమైన యీ జగమును గల్పించెను ౧ కాని యీ హిరణ్య గర్భుఁడం దుండి యెట్లు వచ్చెనని ప్రశ్నింపఁబడెను ఏ పద్ధతి నే శక్తి నుండి యాతఁడు జనించెను? ఆదిని జలమును సృజించిన వాఁడెవఁడు? మనువు హరివంశము పురాణములు మూలప్రళయమును దేవుఁడే కల్పించె ననిరి తన సంకల్పముచే నా జలప్రళయమును గల్పించి యందొక సువర్ణమయ బీజము నుంచి యందుండి తానే బ్రహ్మరూపమున జనించెనని చెప్పఁబడినది నేనే పరబ్రహ్మముయొక్క యింకొక రూపమైన హిరణ్యగర్భుఁడును ౨ దీనివలన శాశ్వతములైయున్న రెండువస్తువుల నొకే పరబ్రహ్మ మాధారముగా గలిగియుండెనని తేలుచున్నది

ఈ సిద్ధాంతమే పిమ్మటిదైన నాసదీయ మంత్రము దీని నిటు మ్యాక్సు ముల్లరు భాషాంతరీకరించినాఁడు

అప్పుడు సదసత్పదార్థములు రెండును లేవు భూలోక స్వర్లోకములును లేవు ఇఁక నేది దేని యందున్నది? జలము గంభీరమైన తావున నున్నదా?

అచ్చట మరణము లేదు అందుచే నమర్త్యత్వము లేదు దివారాత్రములు లేని కాంతియే ఒక్క పరమాత్మయే నిశ్చలుఁడై యున్నాఁడు మఱేదియును లేదు

అంధతమసమున్నది, మొట్టమొదట నంతయు నొక సముద్రమే కాంతిలేదు ఆచ్ఛాదితమై యొక యండమున్నది తపస్సుచే నందుండి యద్వితీయుఁడు జనించినాఁడు

ఆరంభమున నా పరబ్రహ్మ దయాహేతుఁడైనాఁడు మనస్సులో నది బీజ రూపమున నున్నది కవులు జ్ఞానదృష్టిచే దానినిఁ దమ హృదయములలోఁ గనుఁగొని వ్యక్తావ్యక్త సంబంధము నెఱింగిరి

౧ పోల్చు మనువు ౧౫౮ మైత్రి ఉపనిషత్తు ౫ ౨
౨ మనువు ౫ ౯

ఆ పరబ్రహ్మము పై నున్నదా క్రింది నున్నదా? యు వారి జ్ఞానకిరణమును బ్రసరించినారు బీజమును ధరించినవారు శక్తులున్నవి ఆత్మశక్తి క్రిందను లంకల్పము పైనను గలదు

ఈ సృష్టి యెచటనుండి పుట్టినదో యెవ రెఱుగుదురు? ఇచట నెవరు వక్కాణించిరి?

ఈ సృష్టికి దరువాత దేవతలు వచ్చిరి ఇక సృష్టి యెచటనుండి వచ్చినదో ఎవరికి దెలియును?

ఎవనినుండి యీ సృష్టి జనించనదో లేం యా ఆదివ్యక్తి దానిని జేసెనో లేదో ఊర్ధ్వలోకముల కగ్రలోకమైన దానియందుండు బ్రహ్మర్షి కీరహస్యము తెలియవచ్చును దెలియకి పోవచ్చును ౧

ఈ ఋక్కునందు సృష్టినిగూర్చి పరిణతినందిన సిద్ధాంతమును గమనించినాము మొదట సదసత్తులు రెండునులేవు సత్పదార్థము వ్యక్తరూపమున లేదు అందుచే నవ్యక్త మసత్పదార్థమని చెప్పరాదు ఎలన దానినుండి వ్యకమంతయు వచ్చినది ఋక్కు లోని మొదటివాక్యమువలన మనము నిర్మించుకొనిన ప్రమాణము లసంగతములని తెలియు చు న్నది సర్వస్వమునకి వెనుకనున్న అవ్యక్తసత్యమును సత్పదార్థమనికాని యసత్తనికాని చెప్పరాదు ఒకడేయైన యాదిపురుషుడు దూపిరిలేని ఏశ్వాసమొనర్చినాడు ౨ వాని కంటె నితరమేమియును లేదు సూర్య చంద్ర నక్షత్రాకాశములతో గూడిన సృష్టికంటె ప్రథమకారణమైన యాతడు పూర్వుడు ఆతడు దేశ కాల యుగ మరణ జనన మోక్షాతీతుడు వాడున్నాడనియేకాని వాని స్వరూపమెట్టిదో చెప్పజాలము ఇదియే సర్వసృష్టికిబూర్వతమమైన ప్రథమస్థితి అట్టి యవ్యక్తసద్వస్తువునందు మొట్టమొదట నే నను భావము కలిగినది నే నను భావమును నేనుకా దను భావముండక తప్పదు ఎ అను వాడు బి కాదన్నట్లు అందుచే సత్తున కసత్తు వ్యక్తమున కవ్యక్తము తర్కములో ఆత్మ కనాత్మయను నీ ద్వందము మొదటనున్న పూర్ణత్వమునుండి వచ్చినది కారణము తపస్సు అనగా ప్రయత్నమను నావిష్కృతి పూర్ణత్వమవ్యక్తమైన విధానము ఈ తపమువలన వ్యక్తమువ్యక్తము— నేను—నేను కానిది ఆత్మ—అనాత్మ పురుషుడు ప్రకృతి

---

౧ ౧౦ ౧౨౯ చూడు మ్యాక్సు ముల్లర్ షడ్దర్శనములు పుటలు ౬౫ ౬౬
చూడు శతపథబ్రాహ్మణమ్ ౩ ౩ ౧

౨ పోల్చు ఆరిస్టోటిల్ చెప్పిన అచలుడై చలింపజేయువాడు

వచ్చినవి ఈ రెంటి యన్యోన్య సంపర్క సంజాతమే తక్కిన సృష్టి సృష్టికర్త కిట్టి క్రియా పరత్వము కలుగుటకుఁ గారణము కామము కామము అహంకారకారణము ఋషిసృష్టికు బీజము మనసో రేతః కామమే పరిణామరహస్యము వృద్ధికి మూలము ప్రకృతి సామీప్య ముచేఁ బురుషునకుఁ గోరిక లుదయించినవి కామ మాలోచనకంటె నెదికమైనది ౧ బుద్ధి సంచలనము లోపముల జూచుట దానిని పూరించుటకు యత్నించుట కామములోనున్నది వ్యక్తావ్యక్త బాంధవ్యములను గలుగఁజేయునదదియే ఎన్నఁడు పుటుక అద్వితీయమైన శాశ్వతమైన వస్తువు అహంకారముగల బ్రహ్మయై పదార్థము ప్రకృతి అహాత్మ యెదురుగాఁ గాంచనది అహంకారముగల బ్రహ్మకుఁ గామము ప్రధాన లక్షణము కో వేద యను వాక్యము ఎవఁడెఱుగు ననునది సృష్టి రహస్యమును జెప్పుచున్నది తరువాత వచ్చిన తత్త్వజ్ఞులు దీనినే మాయ యని పలికినారు పురుషుని ప్రకృతిని మాత్రమే చెప్పి యాగిపోవు ఋక్కులు కొన్నియున్నవి విశ్వకర్మను సంబోధించిన ఋక్కు నందు (౧౦–౮౨–౫–౬) జలమయ విశ్వసాగరములో నాది జగద్బీజమున్నదని చెప్పఁ బడెను ప్రళయ జలరాశియందు సృష్టి యొక్క అంతరూపమున నున్నది సర్వసృష్టికర్త యైన విశ్వకర్మ ప్రధముఁడై యందుదయించెను ఈ యాది జలరాశి ౧ గ్రీక్కులు ప్రళయ మనిరి జనిసిస్ గ్రంథములో దానినే రూపములేని యవస్థయు నందనంత సంకల్పము బీజరూపమున నున్నదనియు ననిరి ౨ కామము సంకల్పము ఆత్మజ్ఞానము మనస్సు వాక్కు నివి యా యనంతజ్ఞాననిధి లక్షణములు అతఁడే జలరాశిపై సంచారరూపమునఁ దపించుచున్న పరమేశ్వరుఁడు అనంతశాయియైన నారాయణుఁడు జెనిసిస్ గ్రంధముచెప్పిన దేవుఁడితఁడే యిట్లు చెప్పెను జగముండవలెను, జగముండెను ఈ లోకములన్నిటిని పుట్టించెదనని తలఁచెను వెంటనే అన్నియు జలము వాయువు మున్నగునవి పుట్టెను నాసదీయసూక్త మీ ద్వంద్వము నేకేశ్వరత్వములో సమన్వయించినది ప్రకృతి పురుష లొకే యవ్యక్త బ్రహ్మపదార్థము రూపములని చెప్పనది అవ్యక్తబ్రహ్మమాత్మయుఁగా

---

౧ గ్రీక్కుల ప్రాచీనగాథ — మన కామ మువంటి నరివడు ప్రేమా దైవము ఇరాస్ జగమును సృజించెనని చెప్పుచున్నది ప్లేటో తన సింపోజియమ్‌లో నిట్లు మడివి నాఁడు ఇరాస్‌నకు జనకులు లేరు వానికిఁ దల్లిదండ్రులున్నారని పండితులుకాని పామ రులుకాని చెప్పియుండలేదు ఆరిస్టోటల్ దేవుఁడు కామవస్తువుగాఁ జరించునని చెప్పినాఁడు

౨ పోల్చు జెనిసిస్ జలరాశిపై నంతయు నంధకారమే జలముపై భగవంతుఁడు విహరించుచున్నాఁడు (౧ ౨)

చూడు రా వే భా ౧౦ ౧౨౧ ౧౦ ౯౨

దనాత్మయును గాదు అహంకారమునుగాదు ఉదభావమునుగాదు, అది రెంటికి నతీతమైనది దీంలో ద్వంద్వమంతర్లీనము మనమాటలలోఁ జెప్పకొనినచో నా సదీయసూక్తము చెప్పిన సృష్టివిధానములో నీ వరీకరణముగలదు (౧) పూర్ణమైన అవ్యక్తము (౨) నేను నే నని తెలిసకొను సహంజ్ఞానము (౩) నేనుకానిది నిర్ణయించిన యనాత్మ పదార్థము దీనినిబట్టి యవ్యక్త మొక్క మువాూర్తము నవ్యకమైనదని యర్థముకాదు భాషాతర్కములలో నీ దశలున్నవి కాని నిజముగా లేవు నేను నేను గానిది అవిభాజ్యములు అందుచే ఇం దాత్మానాత్మలకు ముందు వెనుకలు లేవు అవ్యక్త మొకప్పుడే తపముచేసి యుండవలెను కాలాతీతమైన పూర్ణావ్యక్త బ్రహ్మము సృష్టిపరంపరగా నిత్యము ప్రదర్శింపఁబడుచునేయున్నది సర్వవస్తు సత్యమైనయటి బ్రహ్మమాత్మజ్ఞాన పరిపూర్ణానుభవము పొందువఱకట్లే జరుగుచుండును అందుచే సృష్టి యెల్లప్పుడును విశ్రాంతి విరామములు లేనిదే నాసదీయసూక్తము సృష్టియెటావిష్కృత మైనదో చెప్పినదికాని యెచటి నుండి యనుదానిని చెప్పలేదు సృష్టిస్థితిస్వరూపముల నది ప్రకటించినది ౧

ఋగ్వేదసూత్రములలో నెచటను బ్రపంచము భ్రాంతి అసత్యమను భావమున కాధారములులేవని మనకుఁ దెలియుచున్నది ప్రపంచ మొకనిష్ప్రయోజనమైన స్వప్నము వంటిదికాదు అది దైవశక్తిప్రదర్శనము మాయ శబ్ద మెచట వాడఁబడినను శక్తి బలము నను నర్థములోనే వాడఁబడినది ఇంద్రుఁడు తనమాయచే వేగముగా ననేకరూపములు దాల్చును ౨ కాని కొన్ని వేళల మాయనుండి వచ్చినశబములు మాయినః మాయావంత రాక్షసుల గుణములనుజెప్పట కుపయోగింపఁబడినవి ౩ మాయ శబము భ్రాంతి లేక అసత్య ప్రదర్శన మను నర్థములోను వాడఁబడినది ౪ ఋగ్వేదము యొక్క తత్త్వము నిరాడంబరమైన అస్తిత్వవాదము తరువాత భారతీయ విజ్ఞానవేత్తలైదు భూతములను ఆకాశము వాయువు అగ్ని జలము భూమియని పేర్కొనిరి కాని ఋగ్వేద మొక్క జలమునే చెప్పినది జలమే మూలపదార్థము ఇందుండి వివిధ పదార్థములు క్రమముగా నుత్పన్నములైనవి

---

౧ పోల్చు ప్లేటో వ్రాసిన టిమాయుస్ గ్రంథములోని భావము చూడు ఫాసెట్ పండితుఁడు తన గ్రంథములలో వ్రాసిన భావములు

౨ ౬ ౪౭ ౧౮

౩ ౫ ౨ ౬ ౬ ౧ ౩ ౧ ౩౬ ౪ ౭ ౪౯ ౨ ౭ ౯౮ ౫

౪ ౧౦ ౫౪ ౧

మనము చదివిన మంత్రములలోనిభావము మొదటనున్నది శూన్యమనియు నందుండి జగముపుటినదనియుఁ దలఁచుట పొరబాటు ప్రథమస్థితి శూన్యముకాదు ఊపిరితోకుఁడ ఎశ్వాసముచేయుచున్న యొక అవ్యక్తశక్తి యున్నదని మంత్రము చెప్పినది సర్వసృష్టికాధార భూతమైన పరమసత్యమునుగూర్చి శూన్యార్థము స్ఫురించునట్లుగాఁ జెప్పుట వేదఋషుల కభ్యాసమైనది అవినాభావసంబంధముగల ఆత్మానాత్మద్వంద్వము సృష్టి పూర్వమున్న అవ్యక్తమునకు లక్షణముకాదు లది రెంటికి నతీతము అనాత్మయనఁగా నిప్పుడున్న జగద్రూప మప్పుడు స్పష్టముగాలేదని యర్థము (౧౦ ౭౨) మంత్రములో వ్యక్త మవ్యక్త మునుండి వచ్చిన దని యున్నది దీనిలో నవ్యక్తమనఁగా శూన్యముకాదు అందుచేఁ దరువాత సాంఖ్యశాస్త్రముగాఁ బ్రబలిన ప్రకృతితత్త్వమున కీ నాసదీయసూక్త యారంభ వాక్యము ను నిరియమును మే మంగీకరింపము ౧

కొన్నివేళల సృష్టి యొక మూలపదార్థమునుండి చేయంబడినటు చెప్పఁబడినది పురుషసూక్తమందు సృష్టిచేయు నధికారులు దేవతలనియు విరాట్పురుషుని శరీరమే సృష్టికి వలయు సామగ్రి నిచ్చెననియుఁ జెప్పఁబడినది ౨ ఈ సృష్టి నిర్మాణ మొక యజ్ఞమనియు నందు విరాట్పురుషుఁడే పశువనియు వర్ణించిరి భూతభవిష్యత్తులందలి జగత్తంతయు విరాట్పురుషరూపమే ౩ ప్రకృతి దేవతోపాసనము పరిణామమందిన హద్దులు మీఱును భారతీయుని యూహాశక్తి యా పురుషదేహమునకు బ్రహ్మాండములైన యవయవముల నిచ్చెను కవి తన ప్రజ్ఞావిశేషముచే సృష్టిని దేవుని సమన్వయించిన యొక దివ్యరూపము నూహించి కల్పించినాఁడు ఒకే అవ్యక్తబ్రహ్మమును జెప్పినసూక్తమునకు నీ సూక్తమునకును విరోధము లేదు మొదటిదాని ననుసరించియుఁ బురుషప్రకృత్యాత్మకమైన జగమంతయు నవ్యక్త బ్రహ్మముయొక్క ఆత్మావిష్కరణముచే వచ్చినది భావముమాత్ర మసంస్కృతమైన కథలోఁ జెప్పఁబడినది ప్రథమావ్యక్తబ్రహ్మము క్రియాశక్తిరూపుఁడైన దేవునిగా మాఱినాఁడు పురుషునుండి విరాట్టు విరాట్టునుండి పురుషుఁడు పుట్టిరి అనగాఁ బురుషుఁడు పుట్టిన నాఁడు పుట్టించనవాఁడు గూడ నైనాఁడు అతఁ డవ్యక్తబ్రహ్మము — అహంకారాన్విత విరాట్పురుషుఁడు

౧ చూడు మెక్డనల్ వేదిక్ రీడర్ పుట ౨౦౭

కొందఱు వేదకాలవిజ్ఞానవేత్తలు—ఆత్మకాని అనాత్మకాని ప్రథమకారణమని చెప్పిరి (౧౦ ౧౨౯ ౧ ౧౦ ౭౨ ౨) తర్కమందు వీరివలననే కార్యము కారణమందున్నదను సత్కార్యవాదము కారణమందుఁగార్యములేదను అసత్కార్యవాదము బయల్వెడలినవి

౨ ౧౦ ౯౦ ౩ ౧౦ ౯౦ ౨

సత్యమైన యాదర్శ మసత్య భావములలోఁబడి యడుగంటినది. పరస్పర విరుద్ధ సిద్ధాంతములతోఁ గూడిన బ్రాహ్మణముల మతములోని సంశయావస శిఖరము నందుకొని ఉపనిషదనంతర యుగమందును లేక బౌద్ధపూర్వ యుగమందును విహరించినది. సత్యము సంప్రదాయముగను ధర్మము సత్య కర్మకలాపము ఘనీభవించిపోయి స్వతంత్రాత్మసాధనోదక మింకిపోయిన యుగ మిది. జీవిత మొక వ్యర్థకర్మపరంపరయైనది. మానవమానసము విధినియమయంత్ర చక్రబద్ధమైనది. స్వేచ్ఛాశ్వాసను కర్మపాశములు కట్టివేసినవి. ఒక మంత్రము పఠించుచునో లేక ఒక కర్మచేయుచునో మానవుఁడు నిద్రనుండి మేల్కొన్నది మొదలు త్రాగుట కుడుచుట స్నానము చేయుట మున్నగు సర్వ క్రియలు చేయవలసి వచ్చినది. అర్థరహిత కర్మలకు మూర్ఖ విశ్వాసములకు సముచితమైన గౌరవము లిచ్చిన శుష్కలఘు తత్త్వమే ప్రాధాన్యము వహించినది. గాంభీర్యములేని శుష్కతత్త్వము హ్రస్వ దృష్టిగల సంకుచితమతము ఆడంబరములతో సపారములు కల్పించి బుద్ధిమంతులను కొంతకాలముకాని జనసామాన్యమును చిరకాలముకాని తృప్తిపఱుపఁజాలదు. సర్వవిచ్ఛిన్నదశ ప్రారంభమైనది. ఉపనిషత్ప్రతిఘటనోద్యమము తీవ్రరూపము దాల్చినది. ఉపనిషత్తుల అద్వైతము వేదముల బహు దేవతారాధనము ఉపనిషత్తుల స్వచ్ఛ బ్రహ్మజ్ఞానము వేదముల క్రతుకలాపము ఉపనిషత్తుల మోక్ష సంసారభావము వేదముల స్వర్గ నరకములు ఉపనిషత్తుల విశ్వజనీన లక్ష్యము వేదముల వర్ణవిభాగము నివి పరస్పరము నసంబద్ధము లగుటచేఁ జిరకాలము కలిసి యుండఁజాలక పోయెను. ఆ యుగము సర్వాంగ పునర్నిర్మాణమును గోరినది. సామాన్యమానవ జీవితమునకుఁ దృప్తి నొసఁగు స్వచ్ఛమైన తాత్త్విక మతముకొఱకై ప్రజలు నిరీక్షించుచుండిరి. పరస్పర విరుద్ధములైన భావముల నసంబద్ధ నాఘరన ముగా నతుకు పెట్టుటచేఁ గలిగిన అసంతృప్తి స్వచ్ఛ సమన్వయమునకు వ్యతిరేకములైన భావములను బెరికివేసినఁగాని శాంతించు నవకాశము లేదు. నాఁటి మతములో స్పష్టముగా గోచరించుచున్న యతుకులను బౌద్ధులు, జైనులు చార్వాకులు బహిరంగముగాఁ జూపనారంభించిరి. బౌద్ధజైనులు నైతిక శుద్ధ ప్రవర్తనావశ్యకత నుగడించి తదనుగుణముగా మత పునర్నిర్మాణమునకుఁ బూనుకొనిరి. కాని వారి ప్రయత్నములు విపవాకృతి వహించినవి. ఉపనిషద్విజ్ఞానమొసఁగిన పరిశుద్ధ విశ్వజనీన ధర్మమును బ్రకటింపఁదలచిరి. కాని బ్రాహ్మణముల వర్ణ విభాగము క్రతుమతము ప్రజాదరణమును గన్న యితర విశ్వాసములు పూరముగా విసర్జనీయములని వారు

తలంచిరి భగవద్గీతయును దరువాత వచ్చిన ఉపనిషత్తును గత చరిత్రమును విస్మరింపక యందలి లోపములను విశాల భావముతో గమనించి యే భావమును త్రోసిపుచ్చ నవసరములేని పూర్ణ సమన్వయ సిద్ధాంత నిర్మాణముకొఱకు యత్నించవలెను. ఉపనిషదనంతర యుగమందు పురాతనాధునాతన మతపునర్నిర్మాణ ప్రతిఘటన వ్యాపారమును దేశములో వేఱువేఱు ప్రదేశములలో సాగించి యుండవచ్చును. బౌద్ధ జైనములు ప్రాచ్య దిశయందును వేదమత ప్రధానస్థానమైన పశ్చిమ దిశయందు భగవద్గీతయును కృషిచేసియున్నది. విజ్ఞాన ప్రపంచమునం జెలరేగిన ఆందోళనము ప్రతిఘటనము పునర్నిర్మాణములతోం గూడినట్టి యీ యుగమునకు మనము తరలుచున్నాము

## పరిశీలన గ్రంథములు


౧ మ్యాక్సుములరు దిఉపనిషత్సు ( సేక్రెడ్ బుక్సు ఆఫ్ ది ఈస్టు వ్యాల్యుములు ౧ ౧౫ )

౨ డ్యూసేన్ — ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు

౩ గఫ్ — ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు

౪ బారువా — ప్రీ బుద్ధిస్టిక్ ఇండియన్ ఫిలాసఫీ

౫ మహాదేవశాస్త్రి — ది తైత్తిరీయోపనిషత్తు

౬ రేనడే — ది సైకాలజీ ఆఫ్ ది ఉపనిషత్సు ఇండియన్ ఫిలాసఫికల్ రివ్యూ ౧౬ ౧౮ ౧౯

౭ హ్యూమ్ — ది థర్టీన్ ప్రిన్సిపల్ ఉపనిషత్సు


మొదటి భాగము

సమాప్తము

---

